Reg. No. 757

# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జనపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రకటింపబడుచున్నది.
గుంటూరు.


| సంపుటము | 1940 సం॥ ఏప్రిల్ నెల | సంచిక |
|---|---|---|
| 32 | | 1 |


విషయములు





చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | 10 0 0 | చందాదారులకు | రు 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# రాజపోషకులు.

శ్రీమంతు, రాణి ఆదిలక్ష్మీదేవమ్మ బహాదరు గారు,
గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీశ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకర భారతీస్వాములవారు; హంపి.

౨ శ్రీశ్రీ జగద్గురు, అభినవోద్దండ విద్యానృసింహభారతీ స్వాములవారు, పుష్పగిరి

3 తంగెడ నరసింహారావుగారు, కరణము, మోర్జంపాడు.

౪ ఆర్. రామారెడ్డిగారు, దైవముదిన్నె.

౫ రాజా సురభి వెంకటరత్నాంబ బహాదరుగారు, రాణి, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురము

౬ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౭ రాజా రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

౮ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

## పోషకులు.

౧ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారుగారు - దేవిడి

3 రాయప్రోలు రాఘవదీక్షితులుగారు, పోలీసు సర్కిలినస్పెక్టరు, గూడూరు

౪ కొండ్రి వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, బసవాపురము.

౫ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇసునూరు.

# అభినవసరస్వతి




సంపుటము ౩౨ } విక్రమ నామసంవత్సరము చైత్రమాసము { సంచిక ౧

## —: నిజాము రాష్ట్రపు బాలికావివాహనిషేధశాసనము :—

కాంగ్రెసువారు కారణముగా నీయుశ్శాసనము బ్రిటీషుప్రభుత్వమువారిచే నమలులోఁ బెట్టఁబడి సనాతనమతస్థుల సంక్షోభింపఁజేయుచుండుట సర్వజనవిదితము. ఈసంక్షోభ మింతవఱకు బ్రిటీషురాష్ట్రవాసులకే తటస్థించియున్నది కాని నేఁడు నిజాము రాష్ట్రవాసులుగూడ భజగోవిందశ్లోకములను బఠింపవలసివచ్చినది. ఆరాజ్యము కన్న నీరాజ్యము నాగరకతలో వెనుకఁబడియున్నదని నవనాగరకులు కొందఱు వివిధ ప్రచారములచే వేనికేనినో వెలుపలికిఁ దీయుచున్నారు. అట్లుతీయుచున్నవానిలో బాలికావివాహనిషేధశాసన మొకటి. ఆయుశ్శాసనము శాసనసభలో సనాతనధర్మవిముఖులచేఁ బ్రవేశపెట్టఁబడినది. సమ్మతులు సహస్రముగాఁ జనుదెంచుచున్నవి. హైదరాబాదు సికింద్రాబాదుపట్టణములలో నార్యమతమను పేరఁ బ్రబలియున్న యనార్యమతము వారిచే నత్యంతము నాందోళనము చేయఁబడుచున్నది. కాని నిజామ్ప్రభువు నీతికోవిదుఁడు. సనాతనధర్మ సంరక్షకుఁడు. దీర్ఘదర్శి. అందువలన నాత్మీయరాష్ట్రవాసులగు నఖిలజనుల యభిప్రాయములను నవగతముఁజేసికొనినఁగాని యట్టిశాసనముల నమలులోఁ బెట్టఁగూడదని యోజించెను. అవసరమయినంత వ్యవధి యనుగ్రహించెను. ఈలోపలనే యెల్లరును నిష్టము నీప్రభువుల కెఱుఁగఁజేయవలెను. నిజమునకు నిజాము రాష్ట్రముననే కాదు, బ్రిటీషురాజ్యముననే కాదు, సర్వత్ర సనాతనమతస్థులే చాల మంది, కాని కంచుమ్రోఁగినట్లు కనకంబు మ్రోఁగునా యను భంగి నవ్వారి యందఱిలోను నార్భాటి మత్యల్పము. ప్రతివాదులలో నది ప్రబలము. అల్పసంఖ్యాకులయ్యు నవ్వార లట్టినల్పప్రచారము చేయుచు సమ్మతులను జాల సంపాదించుచున్నారు. సహస్రసంఖ్యాకులయ్యు సనాతనమతస్థులు కూపకూర్మములభంగి స్వప్రయత్నము లేక యిడుములు పడఁబోవుచున్నారు. హైదరాబాదు సికింద్రాబాదులలో నేయల్పముగనో యనల్పముగనో యీ శాసనవిషయమైన యసమ్మతిప్రచార మగుచున్నది కాని యితరప్రదేశముల నీషన్మాత్రము నీక్షింపఁబడదు. యజ్ఞయాగాదు లాచరించుచున్నారు. శివప్రతిష్ఠాదులు చేయుచున్నారు. పురాణప్రవచనములు పొనరించుచున్నారు. శ్రవణములు సలుపుచున్నారు. తీర్థక్షేత్రములకుఁ దిరుగుచున్నారు. కేవల స్వస్వోదరపూరణమే కాక సల్పఁబడు నివియన్నియు సనాతనధర్మములే యైనను నవ్వానినుండి యాగతమగు నాముష్మికముగూడ నాయావ్యక్తులకు సంబంధించినదే కాని దేశమున కంతకును సంబంధించినది కాదు.

దేశమునకే తీఱని యనర్థము రానున్న దినములలో స్వమాత్ర సంతారకములగు సత్కర్మములు సలిపి సంతృప్తులగుట సాధులక్షణము గాదు. సమర్థలక్షణమును గాదు. అట్టిసమర్థులైన యనేకసహస్రజనులచే నన్వితము మఱియు యవనదేశము. సర్వోత్కృష్టమగు సనాతనధర్మమును సర్వత్ర సంబోధించి బాలికావివాహనిషేధశాసనమునకుఁ

ప్రతికూలాభిప్రాయములను బరిశ్కృతములుగాఁ బడసి ప్రభువులకుఁ బంపవలసిన పరమావశ్యకసమయము ప్రకృతము. ఉపన్యాసపరంపరలచే ధర్మప్రచారమొనర్చిన దేశములలో భరతఖండ మపుడపుడు ప్రథమస్థాన మలంకరించినది. అట్టి యత్యున్నతస్థాన మలంకరించి సర్వప్రపంచమునకును మార్గదర్శకమైన మన భరతభూమి స్వధర్మప్రచారకులు సరిగా లేమిని గర్తవ్యమును గనుగొనలేక కళవళపడుచున్నది. దేశసౌఖ్యమునకును దరించుటకును ధర్మప్రబోధమే బునాది. సర్వదేశములందును స్వధర్మప్రచారము చక్కఁగా సాగింపఁబడుచుండుటచేతనే సౌఖ్యవంతములై సద్యశమును సంతరించుచున్నది. ధర్మప్రచారకులు తక్కువగుటచేతనే దౌర్భాగ్యమునకు స్థానమై భరతఖండము ప్రకృతము పరితపించుచున్నది. ఆర్యమతమను పేరి యవలిపక్షమువారిలో ననేకమతప్రచారకులు బయలుదేఱి యల్లకల్లోలము చేయుచున్నను నిజాముదేశమున నిజమతప్రచారకుల నెమకవలసివచ్చినందులకు నిర్వేదమగుచున్నది. సికింద్రాబాదు హైదరాబాదులలోఁ జేరిన మతప్రచారకులలోఁ గూడ నిరువురుమువ్వురకంటె నెక్కువ యీక్షింపఁబడరు. అందుఁ బ్రభాకర ముమామహేశ్వరపండితులును జివుకుల, అప్పయ్యశాస్త్రిగారును శ్రేష్ఠులు. వీరును బ్రకృత మిటఁ బ్రచారకులుగా నుండినను బ్రిటీషురాజ్యమువారే. యువకులైన దాది, ఉమామహేశ్వరపండితు లుపన్యాసము లిచ్చి యన్యమతప్రవిష్టులగు ననేకుల హిందువులలోపలి కీడ్వఁగలిగిరి. ధర్మప్రబోధలో వీరికున్న వక్తృత్వము స్తవనీయము. పండితులయ్యుఁ బామరులకుఁ బ్రబోధించు పద్ధతి వీరు గమనించినట్లు వేరును గమనింపరు. వేయేల ? వీరి యుపన్యాసములచే వేనవేల ప్రజలు విష్ణుభక్తులై వివిధదేశములలో విలసిల్లుచున్నవారు. యద్విషయమై వీ రుపన్యసింతురో తద్విషయమైన యావేశము తత్క్షణమే జనులకుఁ గలిగితీరును. ఆత్మీయప్రబోధముచే నట్టిజనసంఘముల ననేకముఁ జేర్చి యెట్టి ప్రబలసంస్థనైనను నెదుర్కొని తలక్రిందు సేయు దక్షులయియుఁ దగు సహాయులు లేమికి వగచుచున్నవారు.

యత్కించిన్న్యూనాధిక్యముగా నప్పయ్యశాస్త్రిగారును నటువంటివారే. వారును వయసువచ్చినదాది యనేకస్థలములలో నుపన్యాసములిచ్చుచును గ్రంథములే వ్రాసి ప్రకటించుచును బ్రస్తుతము పత్రికనే ప్రచురింపఁ బ్రారంభించిరి. దివ్యవాణి పేరి వారి వారపత్రిక దిశాచతుష్టయమునం దిమ్మడి ప్రశస్తివహించుచున్నది. నిజాము రాష్ట్రీయశాసనసభను నెలకొల్పఁబడిన బాలికావివాహనిషేధపు బిల్లు కిపు డీయిరువురు పండితులు నెదురుతిరిగి యెక్కువ పనిచేయుచున్నవారు. వంగపల్లి నీలకంఠముగారను వైశ్య లోకరు వీరికి బాసటై విదేశములనుండి విద్వచ్ఛ్రేష్ఠుల రప్పించి సభలు చేయించుచున్నారు. నీలకంఠముగారు బాలికావివాహనిషేధశాసనవిషయముననే కాక సనాతనధర్మోద్ధరణమున శ్రద్ధవహించి చాలపని చేయుచున్న శౌర్యవంతులు. వారితోపాటు వర్తించుచున్న వైశ్యశ్రేష్ఠులు సికింద్రాబాదునగరమున నిఁకను నెందఱో యొసఁగుచుఁ బరిషత్తులనే స్థాపించి పాటుపడుచున్నారు. వీరందఱును విద్వత్సభలు గూర్చి బహునింద్యమైన బాలికావివాహనిషేధవాదమును బహుధా ఖండింపఁజేయుచు బహుజనాసమ్మతిని బ్రభువునకుఁ బంపుచున్నారు. ఈ పెట్టఁబడిన బిల్లు మహమ్మదీయులకుఁ బ్రవర్తింపదఁట. ఎంతయుఁ బాపభీరువులగు హిందువులకేయఁట. బిల్లు ప్రవేశపెట్టిన పెద్దల సుద్దియంతయు నిద్దాననే యీక్షింపఁబడుచున్నది. ఇట్టిబుద్ధితో నెన్నేట్లో తాము ప్రవర్తించుచుండుట చాలదు కాఁబోలు. రజస్వలావివాహములు రచించు

టకుఁ గాని ముండలఁ బెండ్లాడుటకుఁ గాని జాతిమతములు పాటింపక చండాలురతోఁ గలసి పాపడుటకుఁ గాని తమ్మెవ్వరుఁ గమ్మనుటలేదే? దానితోఁ దృప్తిపడక ధర్మరతులగు తక్కిటివారలఁగూడ నిక్కుశాసనములచే నిర్బంధించుట నింద్యము. దుర్మార్గము. వీరందఱును దేశోద్ధారకంమన్యులు కాని నిజమైనదేశోద్ధారకులు గారు. ఇప్పటికిని బశ్చాత్తాపపడక తాము ప్రవేశపెట్టిన తచ్ఛాసనమునకు సమ్మతులు తీసికొనుటకు సభలు సల్పుచున్నారు. గోలకొండ కేలూత నిచ్చుచున్నది. దానికిఁ దగినజవాబు చెప్పువారు చెప్పుచున్నారు కాని దేశోపద్రవకరములగు నింతంత దుష్టశాసనములు ఒయాలు నెవలుసమయమునఁగూడఁ బండితబ్రాహ్మణులు పడుకొని నిదురపోవుచుండుట పరమానర్థము. ఇట్లే కూలిపోయిన తరువాత నివ్వారెల్లరు నెచ్చటఁగూర్చుండి యీ పురాణములు చెప్పుదురో యెఱుఁగము. వేళమిగిలిపోయిన తరువాత విలపించిన లాభము లేదు.

అప్పయ్యశాస్త్రి ఉమామహేశ్వరపండితు లతిసమర్థులైనను ననుచరులు లేకుండ యావద్దేశజనమనంబులను నాకర్షింపఁజాలరు కావున నోనిజామురాష్ట్రీయ సనాతన ధర్మరతపండితులారా! లెండు. ఊరూరికిం జని యుపన్యాసము లిండు. సనాతనధర్మబోధచే జనసహస్రముల బాలికావివాహనిషేధశాసనాసమ్మతులఁ గొండు. స్వమతదేశముల సంరక్షించుకొనవలసిన సమయము వచ్చినది. ఘోరకలి సొచ్చినది. అధర్మము హెచ్చినది. శ్లో॥ ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః.

---

## —: ధర్మములో ఐక్యము. :—

... గోలకొండపత్రికాధిపతులు వ్రాసిన యీవ్యాసము గమనించిన ... సంస్కృత మెంతమాత్రము రాదని... తెలియుచున్నది. అయ్యో! ... రానివారు మాటలాడకుండుటయే శోభ ... వ్యాసములోఁ దా ముదాహరించిన యసంస్కృతపు ముక్క లేగ్రంథమునుండి తీసికొనిరో? ... పూర్వాపరముల విచారింపక రామునితోక పీవరుండిట్లనియెనని చదివినరీతి ... భవిష్యత్పురాణము పేరిటఁ బేర్కొనిన పాతిక శ్లోకము ... సాగను ... వీరు ... భవిష్యత్పురాణపఠనము గావించియుండరనుట స్పష్టము ... భవిష్యత్పురాణమని... చెప్పినదెల్ల నప్పురాణరహస్యముగఁ గన్పట్టదు... ధర్మమునకు వీరొనర్చిన పరిభాష ... గురువులుచేసినది కావచ్చు. బహుజనసమ్మతమే ధర్మమని పూర్వు లెవ్వరును నుడువలేదు. యుక్తియుక్త మొక్కఁడు చెప్పినప్పటికి నది యే మాన్యమని శాస్త్రసమ్మతము ... దొంగపేళ్ళను వ్రాసి ... బహుమతము పేరిటఁ బ్రభుత్వమువారి యొద్దకుఁ బంపుటదేమిధర్మము? ... దొంగతనముకూడ ధర్మమని నిర్ణయించిరేమో! ... తమమతమే బహుమతమని ... కొనియాడుకొనుచున్నారు. తమమతమే బహుమతమైన...శాసనములకై పాటుపడు టెందులకు? ... తా మునిఁగినది గంగ, తావలచినది రంభ యన్నట్లు తమకుఁదోఁచినదే ధర్మమని ... వీ రపూర్వసంస్కరణముఁ జేయ నెంచినారు. అశ్వాలంభాదులను గలియుగమున విడుచుటకు ఋషివాక్యములున్నవి. శారదకూడ నొకఋషియా యేమి? శౌచాచారములు తెలియనివారీకాలమున ఋషులగుదురు కాఁబోలు! ఏమియు లేని విస్తరి యెగిరిపడునట్లు వేదశాస్త్రాధ్యయనశూన్యులును లోకజ్ఞానదూరులు నగుధర్మవిరుద్ధశాసనకర్తల ఋషిత్వ

ప్రశంస వీరివీనులకే యింపుగానుండును. కోటిరూపాయలలో ... నూటిగా స్వరాజ్యమున్నదన్నవారి చుట్టములే కదా యీ ... సంస్కర్తలెల్లరు ! తాముపోయిన పోక చందమున ఋషివాక్యముల నన్వయింప నెంచుచున్నారు.

వీరికి ఋషివాక్యములతో నేమిపని ? శాస్త్రములతో నేమిపని ? వీరి కిష్టమైన ఋషివచనము లేకున్నఁ గల్పితము ... వర్ణాశ్రమధర్మము లెన్నో యడుగంటినవని మొత్తముమీఁద నన్నిఁటి నడుగంటఁజేయుటకు ... దీక్షవహించిరేమో ? కలియుగములో ధర్మములెల్ల నశించునని పురాణములలో వ్రాసిన వ్రాఁతయందలి రహస్యార్థ మెఱుఁగవలదా? అయ్యది ... ధర్మము విడకుండుటకై హెచ్చరించు నభిప్రాయమనియు ధర్మద్రోహులనుండి సురక్షితముగా నుండుటకనియు ధర్మము నడుగంటఁ గొల్పుటకుఁ గాదనియుఁ దెలియనగు. ఈసంస్కర్తలు బయల్వెడలిననాఁటినుండియే యీధర్మవిప్లవము లన్నియుఁ గలుగ మన్నవని చెప్పవచ్చు. లేదా ఇయ్యది యార్యమత ప్రభావమేమో ? ... తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ... సనాతనధర్మమే ధర్మము. అటులఁగానివి "ఉత్పద్యంతే ప్రలీయంతే" అను మనువచనప్రకార మత్యల్పకాలమున నశించును. ధర్మనాశనమునర్ప నెంచువారు స్వయముగానే దేశనాశనము గావింతురు. ఇందువలననే ... స్వరాజ్యము స్వప్నలబ్ధమువలెనో గొంతెమ్మకోరికవలెనో యున్నది ధర్మవిరుద్ధహిందువులకు నపజయమె కనిపించుచున్నది. దీనికిఁ గారణము ధర్మదేవత కోపము. ... సంస్కర్తల దుష్ప్రవర్తనమే యనుట నిర్వివాదము. వర్ణాశ్రమధర్మములలోఁ గొన్ని దేశమున ... నశింపలేదు ... వానిమీఁద రాజకీయ నియమము చేయఁబడలేదు ... పత్రికయం దుదాహరించిన శ్లోకములలోఁ గొన్ని యశుద్ధములు. ఈశ్లోకముల వాస్తవార్థము పత్రికాధిపతులు గ్రహింపఁజాలరైరి. ధర్మశాస్త్రముల పరస్పరవిరోధము నన్వయించుటకుఁ దగిన ప్రతిభ వీరికి లేదు. ఇఁక ... ప్రభుత్వము వారు ధర్మములో జోక్యము గలిగించుకొనిరనునది విచారణీయము ... వారు ... శాసనద్వారమున ... ధర్మమునఁజేసిన హస్తక్షేపము సహింపఁదగినది కాదు ... ధర్మఏవ హతోహంతి ... బదులు ధర్మదేవత తీర్చుకొనఁగలుగును ... వారు యుద్ధమనెడి కఠినావస్థలోఁ బడి యల్లాడుచున్నారు. అయినను విక్టోరియారాణిగారి వాగ్దానము చొప్పున ... మతములలో హస్తక్షేపము చేయకున్న ధర్మో రక్షతి రక్షిత యనునటుల ... ధర్మదేవతానుగ్రహమున జయము గాంచఁగలుగుదురు. వనవాసాజ్ఞాతవాసముల గడపి ... రాజ్యమును ధర్మరా జందినపగిది సనాతనధర్మ్యులు ధర్మరాజ్యము నందెదరని ... సందేశము. ధర్మిష్ఠుల మొఱ కేవల రజస్వలావివాహమును మాన్పుటకొఱకే కాదు. ఇంతకుముందు చేసిన శాసనము లెల్లఁ దొలఁగింపఁ దర్వాతఁగూడ నిట్టిశాసనములుండఁగూడదు...మార్పులనాదిసిద్ధధర్మము నడ్డగింపఁజాలవు. ఇవియన్నియుఁ వానకాలములోని మిడతలు. బెకబెకలాడెడి కప్పలు...శాసన ముండినను ధర్మాభిమానులు ...ఎందఱో కన్యావివాహము లొనర్చుచునే యున్నారు ... ప్రభుత్వమువారు వారి నేలయడ్డుపెట్టరైరి ? ... దేహము నడ్డగింపఁజాలినప్పటికి నాత్మ నడ్డగింపనేరరు ... కలియుగమున సర్వధర్మములును జెడిపోవునని మున్నే పురాణములలో వ్రాసియున్నదే, మరల దానికి హస్తక్షేపమెందుకని గోలకొండపత్రికాధిపతి ... గోల. వారియింటిలో రేపు కన్నము వేసి దొంగిలింప ... దొంగలు రానుండిరని బుద్ధిమంతు లెవరో ముం

డుగాఁ బ్రకటించిన రానేవత్తురని ... రక్షణకై రాజభటుల సహాయ మపేక్షింప కుండునా ? అట్లే కలియుగమున వర్ణసంకరము రానున్నదని ... మహాత్ములు వచింప వర్ణాశ్రమధర్మనిరతు ... లు మతరక్షణకై ప్రయత్న మొనర్చుటయం దాశ్చర్యమేమి ? చెప్పుదంటు ప్రశ్న ... బహుజనమతమే ధర్మమగును వేదము లక్కఱలేదు. శాస్త్రము లనవసరము. వైదికసిద్ధాంతములు తమ మతమును ప్రచార మొనర్పఁదగదు ... నోటికి వచ్చినట్లు వ్రాఁగిన నేగునా ? ... పంచాంగము చించివైచిన నక్షత్రము లూడిపడున స్త్రీ తెలివితక్కువ యూఁక లెక్కవవారు ... మీఁదఁబ్రహార మొనర్చినమాత్రమున ధర్మము పర్రాజము పొందదు ... ప్రోత్సాహ మెక్కువగును. మఱియుఁ బరస్పరవైమనస్యము గలిగి యెదుటివారికిని శత్రువులకును దేలికయగుదురు. తాఁజెడ్డ కోఁతి వనమెల్లఁ జెఱచిన ట్లికర ... పత్రికలుకూడ నిట్లే ... వ్రాఁగుచున్నవి. ఉచితసమయమున వాంద్రకు ... త్తర మీయఁగల ... దయానంద దివాంధదివాకరుఁడు, అభినవచాణక్యుఁడు ...

## —♦ పుష్పగిరి ♦—

(బి. హెచ్. జగదీశచంద్రన్ గారు)

భారతౌన్నత్యమునకుఁ జేయూఁత నొసంగి పురాణప్రసిద్ధమైన క్షేత్రరాజములలోఁ బుష్పగిరి యొక్కటని చెప్పుటలో నతిశయోక్తి లేదు. ఈక్షేత్రము పినాకినీ నదీతీరమున సొంపారఁ బెంపొందు నుపవనంబులచేతను బుష్పఫలభరితంబులైన వృక్షశ్రేణులచేతను శుకపికశారికాది విహంగములకు వాసయోగ్యమైన పర్వతశిఖరములచేతను రమణీయమై కనులపండువుగా నుండును. పినాకినీనది సదాధారవలె సర్వదా పాఱుచుండును. తొల్లి గరుడుఁడు మాతకోరిక నెఱవేర్ప గంధమాదనగిరి కేగి యమృతకలశమును గైకొని ఖేచరమార్గమున నేగుచుండ నింద్రుఁ డడ్డుతగులుటయు ఘోరసంగ్రామము జరిగెను. అప్పు డొక యమృతబిందువు త దధఃస్థలమునందుండు సరోవరమునఁ బడెను. ఒక మునిపుంగవుఁడు మరణించుటయు నాతని శల్యములను వారణాసియందు గంగలోఁ గలుపఁ గూర్మిసుతుఁ డామార్గమునఁ బోవుచు డస్సి శల్యముల మూట సరోవరము గట్టున నుంచి సలిలము ద్రాఁగుటకై పినాకినీ నదిలో దిగెను. ఆడింభకుఁడు మరల వచ్చి చూచుసరికి నాశల్యములు పుష్పములుగా మాఱియుండుటయు నత్యాశ్చర్యమానసుఁడై యాపుష్పముల నచటఁ బ్రతిష్ఠఁజేసి తన గేహమునకు వెళ్ళెను. ఆకారణము మొదలు నేఁటివఱకు నది పుష్పగిరినాఁ జెలంగెను. ఆయమృతసరోవరము రమణీయమై యట్లుండుటయు నొకదినమున నొక వృద్ధకృషీవలుఁడు సరోవరముచెంతఁ దన వృషభములను దోలి భార్యరాక నిరీక్షించుచుండ నావృషభము లాసరోవరజలమును ద్రావి మంచి బలిష్ఠములైన కుఱ్ఱలై నిలిచెను. ఈవింతను జూచి యాశ్చర్యపడి యావృద్ధకర్షకుఁడు తాను నాయమృతజలమును ద్రావి నవమోహనాకారుఁడాయెను. ఇంతలో నేతెంచి తనభర్త యెవరైనదియుఁ దెలియక సందిగ్ధావస్థయం దుండుచు నాకర్షకుని భార్యయగు వృద్ధస్త్రీయు సరోవరజలమునుఁ ద్రాఁగి నవమోహనాంగి యయ్యె.

సాయంసమయమున వారందఱుఁ దమ గ్రామముఁ జేరిరి. తద్గ్రామస్థు లందఱు నాశ్చర్యపడిరి. ఆసరోవరమున కేగి యమృతజలమును ద్రాఁగుచుండిరి. ఇది నారదుఁడెఱింగి బ్రహ్మతో మొఱపెట్టుకొనెను. బ్రహ్మవిష్ణుమహేశ్వరు లాస్థానమున కేతెం

చిరి. విష్ణువు హనుమంతునితో నొకపర్వతమును దెచ్చి సరోవరమునఁ బడవేయుమ చెప్పెను. పడవేసిన యాపర్వత మొక పుష్పమై సరస్సునందుఁ దేలుచుండుటయ విష్ణుమహేశ్వరులు తమ పాదములతో దాని నదిమిరి. పిదప సరస్సు మాయఁబ పర్వత మేర్పడియెను. అందువలననే యాపర్వతమున విష్ణుపాదము రుద్రపాదము న రారుచున్నయవి. కమలసంభవాంజనేయాది ఘనదేవతాలయములను గనఁబడియెడి అదియే పుష్పగిరి క్షేత్రము. ఇందుఁ గొన్నియంశములు కడపజిల్లాగజెటునుం గ్రహింపఁబడినవి. ఈపుష్పగిరిని గొన్ని దేవాలయములు శిథిలములైయున్నవి. వైష్ణ లీపుష్పగిరి నహోబిలమునకుఁ బుష్పగిరికి మధ్యనుండుటచే మధ్యాహోబిలమనుచున్నార శైవులు కాశీక్షేత్రమునకు రామేశ్వరమునకు మధ్యరంగమునం దుండుటచే మధ్యకైలా మని పిలిచెదరు. ప్రస్తుతము 5 అంతస్థుల గాలిగోపురము గల్గిన చెన్నకేశవదేవాలయమ వృషభారూఢుఁడైన మహేశ్వరు దేవాలయము నున్నవి శివాలయమున నొక భిన్న మైన శిలాశాసన మున్నది. అందులోఁ గ్రీ॥ శ॥ 1582 వ సం॥ కృష్ణదేవరాయల యనంత మచ్యుతదేవరాయలు విజయనగరముపాలించు తరుణమునఁ బుష్పగిరియందుఁ గొన్ని దేవాలయములను బ్రతిష్ఠించిన ట్లున్నది. ఈదేవాలయములయందలి శిల్పము విజయ నగరాంధ్రరాజుల కాలపు శిల్పమును బోలియున్నది. కడప కర్నూలు కాలువ పుష్ప గిరి కొక మైలుదూరమునఁ బినాకినీనదియందు సమ్మేళనమగుచున్నది. ప్రస్తుతము పుష్ప గిరి శిథిలమైన కుగ్రామమువలె నున్నది. జనసంఖ్య యర్చకులుఁ జెంచులు వేశ్యలు నో వందకుఁ బైఁబడి యుండవచ్చును. ఇచ్చటనే పుష్పగిరిమఠాధిపతులు పీఠమును స్థాపిం నారు. ఈపీఠాధిపతుల భవనమం దొక కూప మున్నది. అయ్యది ప్రథమపీఠాధిప 1725 శా॥ శ॥ త్రవ్వించినటు లొక శిలాశాసనమున్నది. ఈపుష్పగిరి కడపతాలూక చెన్నూరుకు సమీపమం దున్నది.

---

—: దైవముదిన్నె వేంకటేశ్వరస్వామికి :—

సీ. త్వత్పాదయుగళిపైఁ దలవాల్చి భక్తిమై
　　అపుడప్డు కన్నుల నద్దుకొనుచు
పండితకవులును బ్రభువుం గుమారులు
　　సలుపు నీస్తుతిపాఠములను వినుచు
గజరథతురగాదికంబులం గైసేసి
　　ఊరేగు నీ సౌరు తీరు గనుచు
రామరాయార్పిత రజతపాత్రలలోన
　　పక్వాన్నములు కుట్లుపట్టఁ దినుచు
ఐదుదినములు లగు త్వదాధ్యకల్యాణోత్స
వమున మనుచు గౌరవమున నచటి
సభల నోలలాడ శుభద దైవముదిన్నె
వేంకటేశ ! ఇంక వీడ దాశ.

శా. శ్రీమ ద్రామమహీశుఁ డగ్రిమున నాసీనుండుగా సత్కవి
స్తోమం బొక్కట గాయకుల్ మఱొకటన్ సోమేశ్వరా ద్యాత్మజుల్
సామంతుల్ మఱియొక్కటన్ సుకవితా సంగీత సల్లాపముల్
వేమాఱున్ వినిపించుచుంట గనుఁగో వీలెద్దొకో వీనికిన్ ? 2

తే. రామభూపాలుఁడును మఱి రామకృష్ణ
భూమిపాలకుఁడును నిజభుజములందు
భవదధిష్ఠిత పీఠంపుభరము మోయు
టీక్షణముసేయు టెన్నడో యిఁకను దేవ ? 3

ఆ. పెత్తనంబు వచ్చి పీడించుచున్నను నెట్లొ వచ్చుచుంటి నేట నేట.
ఎప్పటికిని దీఱ కేచె దౌర్బల్యంబు. ఏమిసేతు? ని న్నిఁకెట్లుచూతు?

సీ. అరుగులెక్కుచు వెన్క కొరుగుచో రామభూ
మీశుండె చేయూఁత యీయవలసె.
నీరసపడెడిచో నెమ్మి రాఘవశాస్త్రి
పేయంబు లిప్పింప డాయవలసె.
నడబావి కరుగలే కుడుకుచో వేన్నీళ్ళు
భూసురుల్ కొనితెచ్చి పోయవలసె.
అదియిది యననేల ? అన్నింట నందఱు
చేతనౌ సాయంబు చేయవలసె.
ప్రభువు సంస్థానపండితుల్ పరులు పలువు
రిన్నివిధముల నారయుచున్నఁగాని
తిన్నగాఁ ద్వన్మహోత్సవదినము లైదు
వెళ్ళవయ్యె నిఁకేమందు వేంకటేశ ! 5

శా. వీపీచేయుము పెద్దవాఁడవయి తోవిద్వత్కవీ ! ఇర్వదేన్
రూపాయల్ తమి నిచ్చి పుచ్చుకొనెదన్ రూఢంబుగా దాని నం
చాపద్బంధువు రామభూమిపతి యీయం గొంత విశ్రాంతి నీ
రూపం బిందె భజించుచుంటి హృది, చిద్రూపా ! నమస్తే నమః. 6

* * *

ఉ. పంపిన యీనమస్కరణపద్యము లొక్కటి బీరుపోవనీ
కుంపుఁడు వేంకటేశపదయుగ్మమునందున. శ్రద్ధతోడ వి
న్పింపుఁడు రామభూమిపతి ! నెచ్చెలి రాఘవశాస్త్రి ! నన్ను మ
న్నింపుఁడు రానియందులకు. నింపుఁడు ప్రేమరసంబు నాపయిన్. 7

సీ. భోగము మెఱుఁగులం బొనరింపకున్నను
రసహీనగాదు నా రచనయంచు
కృతిపతిం గొనిపోయి గిరిఁ జేర్పకున్నను
మెఱుగుపెట్టును సత్యచరితకంచు
అతిశయోక్త్యుత్ప్రేక్ష లంత లేకున్నను
ఉపమాదులకు లోప ముండదంచు
పదడంబరంబుతో భయపెట్టకున్నను
పొడిముక్క యొకటియుం బడదటంచు

నచ్చఁజెప్పి స్వామి మెచ్చుచో దైరి కె
క్కించుకొనుము స్వయము, ఎడద నన్ను
సదయ ముంచుకొనుము సంస్థానపండిత
ద్వయము! బదులు వ్రాయు రయము శివము.

జానపాటి పట్టాభిరామశాస్త్రి.

—: సంకట రామశాస్త్రి :—

కొఱవిఁ బెట్టి తల గోఁకికొన్నట్లు కొందఱు సుప్రసిద్ధులగు మహామహులను గూర్చి నికృష్టపువ్రాఁతలను లిఖించుచుందురు. అట్టివి కొన్ని నికృష్టమైన యక్షరములు పత్రికాసంపాదకులే వివేచనాదూరముగాఁ దమయాంధ్రిలోఁ బ్రచురించుటకుఁ దోడి పత్రికయగు మాయభినవసరస్వతి విచారించుచున్నది. దానిస్వరూపమును గొండొక చూపుచున్నారము. 'వెంకటరామశాస్త్రి సంకటరామశాస్త్రి' అనెడి యొకయసభ్యమైన మాటను జగత్ప్రసిద్ధులు మహోపాధ్యాయులు శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులు గారినిగూర్చి శ్రీఅకొండి వ్యాసమూర్తిశాస్త్రులుగారన్నట్లు ప్రమాధి సం॥ మాఘ మాసపు టాంధ్రీపత్రికలోఁ గన్పడుచున్నవి. పైమహావిద్వాంసు లిరువురును నిన్న మొన్నటిదాఁక సజీవులు. ప్రస్తుతము వారివారికొమరులు లోనగువారు కలరు. పూర్వము వారికిని వారికిని నట్టిప్రసంగము జరిగినదో లేక యెవరేని కల్పించిరో? అట్లన నేల ? జరిగినదే యందము జరిగినను నట్టి న్యూనతాపాదకమైన తిట్టును వారిలో నొకరికి గౌరవము సంపాదించి వేఱొకరికి న్యూనతను గల్పించుతలఁపుతోఁ బత్రికాసంపాదకులు ప్రచురించుట సంగతము కాదనియే మాసరస్వతి యభిప్రాయపడుచున్నది. ఆమాట యాకొండి వ్యాసమూర్తిశాస్త్రులుగారు కల్లూరి వేంకటరామశాస్త్రులుగారిని గూర్చి పలికినట్లు సంపాదకులు వ్యాఖ్యానించినారు. సందర్భ మెట్టిదనఁగా - కల్లూరిశాస్త్రులుగారేమో, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రులుగారిని 'వ్యాజమూర్తి' అని యేదోవాదోపవాదాలలో నన్నారఁట ! అట్లనుటకూడ నెట్టయెదుటఁ గాదు. పరోక్షములో నన్నట్టులు సంపాదకుల వ్రాఁతధోరణివలన నవగతమయ్యెడిని. అది యెవరో వ్యాసమూర్తిశాస్త్రులుగారికిఁ దెలుపఁగా వ్యాసమూర్తిశాస్త్రులుగారు నాపేరిలోఁ దొలఁగించిన నకారము వారి మొగముననే పడవేయుఁడు వ్యర్థముగఁ బోనిచ్చుట యెందులకు ? అని చమత్కరించి

గారఁట! ఆచమత్కారమునకు నచ్చునర్థము పాఠకలోకమునకు బోధపడదేమో యని (వేంకటరామశాస్త్రి - సంకటరామశాస్త్రి) అను కుండలీకరణపుగుర్తుతో వ్యాఖ్యానించిన పత్రికాసంపాదకుల ధోరణిని మాసరస్వతి యామోదింప లేకున్నది. మఱియు వీరిరువురును గీర్తిశేషులే జగత్ప్రసిద్ధులే. కనుకఁ బూర్వకవులలోఁ జేర్పఁదగినవారగుటచే వారింగుఱిచి వ్రాసినట్లే వీరింగూర్చికూడ వినికినిబట్టికాని యెఱుకనుబట్టిగాని యాయా యీసందర్భములు యుక్తాయుక్తవిచారణతో నవసరములేకుండ ముచ్చటించుకోవచ్చుననుటకును నవకాశము కన్పడదు. సుమారుమూఁడేండ్లనాడు కాఁబోలు నాంధ్రపత్రికలోఁ గ్రొత్తగా వెలువడిన పుస్తకములో శ్రీవ్యాసమూర్తి శాస్త్రులుగారి కుమారుఁడు తమతండ్రిగారినిగూర్చి యేదో దూషణను సూచించు వ్రాఁతను బురస్కరించుకొని ప్రకటించిన 'నివేదనము' అనుశీర్షిక గలవ్యాసము వలన నిట్టివ్రాఁతలు గతించిన వారియాత్మలకే కాక వారివారి సంతానములకును జింతాకరములగునని స్పష్టపడుచున్నవి. మఱియును శతావధాని బ్ర. శ్రీ. చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రులుగారు లేటు శ్రీపిఠాపురము రాజావారినిగూర్చి వ్రాయువ్యాసములలో నేదో విషయము తమకు బాధకమైనది యున్నదని శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు తెలుపఁగా వేంకటశాస్త్రులుగారు సవరించెదమని ప్రత్యుత్తర మిచ్చినది కృష్ణలో నున్నది. కావునఁ గీర్తిశేషులనుగూర్చి వ్రాయునప్పుడుఁగూడ నిచ్చవచ్చినట్లు వ్రాయుట యుక్తము గాదు. అందులో నిన్నమొన్న కీర్తిశేషులైన వారింగూర్చి వేఱుగఁ జెప్పనే యక్కఱలేదు. పోనీ వారనుకొన్న మాటమాత్రము చూపి విరమింపక వ్యాఖ్యానము చేయుటయేకాక "ఇది టంకముపాడి అతుకుకొనిన ట్లతుకుకొనినదిగదా!" అని తమ సంతోషమును దెల్పుటలో నెంతటి యనౌచిత్య మిమిడియున్నదో సహృదయులు గమనింపవలసియుండును. వ్యాసమూర్తిశాస్త్రులుగా నారామద్రావిడులు. ప్రకృత మాంధ్రపత్రిక యారామద్రావిడశాఖీయులైన శ్రీమదోలేటి వేంకటరామశాస్త్రులవారి సర్వాధ్యక్షతమీఁద బయలువెడలినది. దీనికి సంపాదకత్వము వహించు సత్యనారాయణశాస్త్రిగారును నారామద్రావిడులే. కల్లూరి వేంకటరామశాస్త్రులవారు వెలనాఁటివారు. ఆకారణముచే వారిని పరాభవించుట కేర్పడిన (సంకటరామశాస్త్రి) పదము గ్రాహ్యమైనను బత్రికాసంపాదకుల కామోదప్రదమైనట్లు స్పష్టపడుచున్నది. సర్వసమబుద్ధితో నడుపవలసిన పత్రికాసంపాదకుల కిట్టిశాఖాభిమానము లుండుట యుక్తము కాదు. అయీ యాంధ్రపత్రికలోని వ్రాఁతను శ్రీకల్లూరి వేంకటరామశాస్త్రులుగారి కొమరులు చూచి లోఁగడ వ్యాసమూర్తిశాస్త్రులవారి కొమరులంబలె విచారింతురేమో, యని యేని సంపాదకులకుఁ దోఁచదేలొకో! ఈపత్రిక బ్ర. శ్రీ. మహామహోపాధ్యాయ కవిసార్వభౌమ కళాప్రపూర్ణా ద్యనేకబిరుద విరాజమానులును సుప్రసిద్ధులును నగు శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులవారి భారతాంధ్రీకరణమునుగూర్చి ఫాల్గునమాససంచికలో వ్రాసిన వాక్యములుగూడ విమర్శించి చూచినచో సదుద్దేశమూలకములుగాఁ గన్పడవు. ఈయంశమును నిర్ధారణచేయుటకు నావ్యాసములో నెన్నో వాక్యములు కనుపడుచున్నవి. కొన్ని మచ్చు చూపఁబడుచున్నవి.

1. శ్రీపాదవారి శతాధికగ్రంథకర్తృత్వము కొందఱికి కామోదము కలిగించకున్నను ...
2. నన్నయతిక్కనలకు మించి యాచితిని భాటించితివని కవిగా రందురు ...
3. బాలాత్రిపురసుందరీదేవతోపాసనమున వీ రన్నవాక్కు తప్పక జరిగెడిదని యొక్క ప్పుడు చెప్పికొనిరి ?

ఇంకను నిట్టివి కలవు. సుప్రసిద్ధులనుగూర్చి వ్రాయునపుడు మనసులో నేదో యభిమానముగాని ద్వేషముగాని పెట్టుకొని యేదో యనుచితము వ్రాయుటగాని గోడమీఁది పిల్లివాటము మాదిరివ్రాత వ్రాయుటగాని యసంగతమనియు నిది తుదకు "కొఱవితో తలగోఁకికొనుట" వంటిదిగాఁ బరిణమించునేమో యనియు మా యభినవ సరస్వతి యభిప్రాయపడి తన కడఁగొట్టుచెల్లెలికి, ఆంధ్రికి, ఇది తగదని సలహా యిచ్చు చున్నది.

---

## ప్రకృతపరిస్థితినిగూర్చిన పరిదేవనము

(గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు, శతావధాని, గద్వాలసంస్థానపండితుఁడు)

చ. సతత విదేశ్యపాలనకు జంకుచుఁ గొంకెద దాల్చు హైందవ
ప్రతతుల నేలవచ్చిన కృపావతి యెంపరిసఫిండియా జగ
ద్ధితమతిఁ జేయియెత్తి తమదేశ మతప్రతిభాళిఁ జట్టస
మ్మతి కెఱఁ జేయనం చనియెఁ-మాయమతో నని మాయమయ్యెఁగా!

సీ. తఱముమీఱిన యుపద్రవ మెదిరించిన
ప్రతికారమార్గముల్ వెతుకరైరి.
కానిపద్ధతిఁ బెనుగండంబు పైకొన
చేరి విచారముల్ సేయరైరి.
సాధుశీలముల నష్టస్థితి దోఁచిన
తల్లడపడుచుఁ జింతిల్లరైరి.
దొరల శాసనములు దుస్సహామని విన్న
పలువు రొక్కటియయి పలుకరైరి.
పతితులును బ్రహ్మవాదులుఁ బ్రభులు నఖిల
భారతీయులు నీకులభ్రంశవిధుల
కించుకయు సంచలించుట యెఱుకపడదు
శరణ మింక నేమి నుడువు మోఁ భరతమాత !

---

—॥ విశ్వామిత్రుఁడు శ్రీరాముని దనతోఁ బంపుమని దశరథుని గోరుట ॥—

చ. జనవర! భానుసంజనితసత్కులమం దుదయంబు గాంచి స
జ్జనసుతుఁడౌ వసిష్ఠమునిచంద్రునకున్ వశవర్తివై జగ
ద్వినుతపథంబునందుఁ బృథివీభర మూనెదు నీకు నిట్టివ
ర్తన మొకవింతయౌనె! భళిరా! ఇది యెంతయునొప్పు నీయెడన్.

కం. అవనీధవ! నావాక్యం
బవధారుము, కార్యనిశ్చయము చేయుము, ధ
ర్మవు రక్షింపుము, నింపుము
భువనంబుల నెల్ల శుభ్రభూరియశంబున్. 142

శా. ఆరంభించినవాఁడ నే నొక మహాయజ్ఞంబు సిద్ధ్యర్థమై
ఘోరాకారులు పాపవర్తనులు రక్షోనాయకుల్ కొంద ఱా
ప్రారంభంబును విఘ్నమున్ జలుపఁగా యత్నించుచున్నారు దు
ర్వారోదగ్రదురాగ్రహోగ్రులగుచున్ రాజన్యచూడామణీ! 143

ఉ. జన్నమొనర్చి వేల్పులకు సంతసమున్ బొనరించువేడ్క నేఁ
దన్నియమంబున న్నిలువ దానవశుంఠలు హోమవేదికన్
మిన్ననుండి మాంసమును నెత్తురు నెమ్ములు గ్రుమ్మరించి నన్
బన్నముపాలొనర్చెదరు నల్వురు తోడిమునుల్ హసింపఁగన్. 144

శా. ఎన్నోమాఱులు పెక్కుజన్నములుమున్నిట్లౌటఁ జిత్తంబులో
న న్నైరాశ్యముఁగాంచి వచ్చితిని సంతాపంబునన్, గ్రోధమున్
దన్నీచాత్ములయందుఁ జూపుటకుఁ జిత్తం బొప్ప దక్రోధసం
పన్నత్వంబె తదధ్వరక్రియలకున్ బ్రాధాన్యమున్ గాంచుటన్.

కం. ఈదృశయజ్ఞ మవిఘ్నత నీదుప్రసాదమున నేను నెఱవేఱిచి స
ర్వోదారఫలమునందెద భూదారవరేణ్య! నన్నుఁ బ్రోవుము కరుణన్.

ఆ. వె. ఆర్తినంది శరణమాసించివచ్చిన
యర్థి విఫలభావ మందెనేని
యాచకునకె కాదు యాచితునకుఁగూడ
నది పరాభవంబె యగును జుమ్ము. 147

వ. కావున,

సీ. కలకాల మెవ్వాని కడగంటిచూపులఁ
గలిమిలేమ యొనర్చుఁ గాఁపురంబు
మదమెక్కి పొదలెడు కొదమబెబ్బులిలీల
వెలయించు నెవ్వాఁడు విక్రమంబు
అసమానధైర్యశౌర్యాటోపముల నెవ్వఁ
డమరాధిపతి కుద్దియై తనర్చు
అఖిలరక్షస్సమూహ విదారణమునకై
జనియించె నెవఁ డీరసాతలమున

ఆ. వె. ఆపవిత్రనాము నభిరామగుణధాముఁ
గాకపక్షధరుఁ ద్రిలోకవీరు
నీదు పెద్దకొడుకు నిరవద్యవిక్రము
రాము నిమ్ము నాకు రాజచంద్ర! 149

కం. తన దివ్యతేజమున నీతనయుం డీవిఘ్నకరుల తల లన్నింటిన్
గనుమూసి తెఱచులోపలఁ దునుముక్ నాచేత రక్షితుండై యనఘా!

ఉ. ఇంతియ కాక నీసుతున కెంతయు మేలొన గూర్తు నోధరా
కాంతుఁడ! దాన నాతఁడు జగత్త్రయపూజ్యతఁ గాంచుఁజుమ్ము, త
త్ప్రాంతముఁ జేరనోడుదురు దానవు లెంతటివీరులున్; రుషా
క్రాంతమృగేంద్రముఁ గను మృగంబులరీతిని భీతి నందుచున్. 151

కం. వారల నోరు లెదిరింపరు
శ్రీరాముఁడుదక్కఁ గొదమసింగముదక్కన్
ఘోరమదవారణాళివి
దారణమున కూనుకొనునె తక్కుమృగంబుల్! 152

కం. ఖరదూషణభృత్యులు బహు
దురితాత్ములు, వీర్యగర్వితులు, తమసముల్
గరళభయంకరులగు వా
రొరుల కజేయులు తలంప నుర్వీరమణా! 153

కం. శ్రీరాముని నారాచము లారాక్షసులకు సోకినంతనె వారల్
ధారాధరధారలకు ధరారజమువిధాన నణఁగరా? ధరణీశా! 154

శా. పుత్రస్నేహము నెంచఁగావలవ దోభూపాల! మీ బోఁటి యా
ర్తత్రాణైకపరాయణోత్తముల కీరా నర్థముల్ గల్గునే?
శత్రువ్రాతము చచ్చినట్టులెచుమా, సందిగ్ధకార్యంబులన్
ధాత్రిన్ మాదృశులైన ప్రాజ్ఞులెపుడున్ వర్తించరం చెంచుమా.

తే. గీ. ఏ నెఱుంగుదు శ్రీరాము నిద్ధమహిము,
నీవసిష్ఠమహర్షియు నెఱుఁగు, మఱియు
నితరులగు దీర్ఘదర్శను లెఱుఁగువారు;
పరుల కీతని నెఱుఁగఁగాఁ దరముకాదు. 156

చ. యశమును ధర్మమున్ మఱి మహత్త్వము వీడఁగరానివంచు నో
దశరథరాజశేఖర! యొదన్ గలవాఁడవయేని రాము నా
వశ మొనరింపఁగాఁదగు నవశ్యముగా, నల యాగమేనియున్
దశదివసప్రమాణము, వృథాభయ మందెదవేమొ నీమదిన్. 157

ఉ. వేగిరపెట్టి బాలకుని వే కొనిపోవు మునీంద్రుఁడంచు లో
లో గణియింతువేమొ, నృపలోకశిఖామణి! అట్లు గాదుచూ!
నీగురుఁడౌ వసిష్ఠ మహనీయగుణాఢ్యుల నీదుమంత్రులన్
బాగుగ సంప్రతించి యటుపై నొనరింపుము తద్వచోగతిన్. 158

ఉ. ఈయుపకారమున్ జలుప నియ్యదియే సమయంబు రాజ! యొ
ప్పో యొనరింతునన్న నుపయోగము లేదు, సకాలకార్యముల్
వేయిమణుంగులై యిల ఫలించును గొంచెము లయ్యు; సత్ఫలం
బీయ వకాలకార్యము లహీనము లయ్యును గాలవిద్వరా! 159

వ. అని ధర్మార్థసహితంబుగా వచియించి విశ్వామిత్రుండు విరమించు
టయు దశరథుం డేమియుం బలుకనేరక కొంతతడవు నిశ్చేష్టితుండై
దీనాలాపంబుల నిట్లనియె. 160

—♦ దశరథుఁడు శ్రీరాముని బంపఁజాలనని దైన్యముఁ జూపుట ♦—

సీ. ఈడు పదాఱేడులేనియు రాలేదు
తల్లిదండ్రుల చాటుపిల్లవాఁడు,
తనయంతఁ దాను భోజనముసేయఁగ నేరఁ
డనుజులతో నాటలాడువాఁడు

పొద్దు గ్రుంకిన సుంత నిద్దుర కోర్వలేఁ
డాఁకలి కొక్కింత యాఁగలేఁడు,
విల్లునమ్మన నేమొ విని కని యెఱుఁగఁడు
నిముస మమ్మలఁ బాసి నిలువలేఁడు

తే. గీ. ఇట్టి నారామభద్రు నాచిట్టితండ్రి
క్రూరులగు రక్కసులతోడఁ బోరుకొలుకు
పుత్రమోహంబుఁ దెగఁగోసి మునివరేణ్య!
చేతులారంగ మీ కప్పఁజెప్పఁగలనె? 161

## దశరథుఁడు శ్రీరాముని బంపఁజాలననుట

తే. గీ. నిండ్లరాలేదు మారామునికిఁ బదాఱు
వత్సరములేన్ని, ఈచిన్నివయసునందు
అతఁడు రాకాసిమూఁకతో నని యొనర్చు
నంతమాత్రపువాఁడు గాఁ డార్యచరిత! 162

ఉ. అంతిపురంబుదక్క మఱి యన్య మెఱుంగఁడు రాఘవుండు, తా
నింతకు మున్ రణంబుఁ గననే కనలేదు. సురారులన్న లో
కాంతకు, లట్టివారల బలాబలముల్ గని పోరఁగా నతం
డెంతటివాఁడు? నన్ను క్షమియింపుము నింపుము కూర్మి పెంపునన్.

కం. అని నేయునే ర్పెఱుంగఁడు
ఘనతరశస్త్రాస్త్రములును గలుగవు, సమరా
వనిఁ బోరువారినైనను
గనలే; దెటు రాఘవుండు కదనమొనర్చున్? 164

ఉ. రాజకుమారులన్ గలిసి రాముఁడు నిత్యముఁ బుష్పవాటులన్
రాజిత నాగరోపవనరాజములన్ గుసుమప్రకీర్ణ గే
హాజిరభూములన్ దగ విహారమొనర్చుటె నేర్చుఁగాని తా
నాజితలం బనంగ విననైనను లేదు మహర్షిశేఖరా! 16౬

చ. ఇదియునుఁగాక నాదు దురదృష్టవశంబున నిప్డు రాఘవుం
డెద నెదియో బెడందగొని యెంతయుఁ గార్శ్యమునందెఁ, గారణం

బిదియని యేరికిన్ నుడువఁ, డిచ్చవహింపఁడు భోజనాదులన్,
ముదమునఁ దమ్ములన్ గలిసి ముచ్చటలాడఁ డిఁకేమిసెప్పుదున్?

కం. సుతుఁ డిట్లౌటకు నేనున్
సతులును మంత్రులును భృత్యసముదాయంబున్
ధృతిచెడియున్నారముచు
మ్మతినీరసవృత్తి శారదాభ్రముల గతిన్. 167

కం. గాధిజ! యీదృశు బాలకు,
నాధివశీకృతు ననాదృతాశను రఘుసో
నాథుల నెదిరించి మహా
యోధన మొనరింప నెట్లు లోనఁగుదుఁ జెపుమా. 168

కం. జవరాలిపొందుకంటెను
నవనీరాజ్యంబుకంటె నమృతముకంటెన్
వివరింప సుతస్నేహమె
మివులన్ సుఖమొసఁగుఁ దపసిమిన్న ! నిజముగన్. 169

కం. అతికఠినము లగుతపములు
నతులక్రతువులు మహాదురంతవ్రతముల్
మతిమన్ముఖ్యులునైతము
సుతులకునై కాదె పొనరుచుట మునినాథా! 170

ఆ. వె. అసువులైన ధనములైనను భార్యల
నైన నుజ్జగించుఁ గాని పుత్రు
విడువనొల్లఁ డెట్టివెంబరవిత్తైనఁ
బ్రాణులందు నిది స్వభావగుణము. 171

తే. గీ. కూటయుద్ధజ్ఞులైన నిశాటు లెంతొ
క్రూరకర్ములు; వారికిన్ గోమలాంగుఁ
డైనరామునరున్ గల్గు నాహవంబ
టన్నమాటయె కడు దుస్సహమ్ము సుమ్ము. 172

కం. మనవొల్ల నిముసమేనియు, ననఘా! శ్రీరాము నెడసి యటుగావున నా
మనుగడ గోరెదు నీ వాతనిఁ గొంపోవంగఁదగునె ధర్మనిధానా!

ఉ. తొమ్మిదివేలయేడు లతిదుస్సహకష్టము లందినట్టి నా
కి మ్ముదిప్రాయమందు జనియించిరి నల్వురుపుత్రు, లం దజ
స్రమ్ముఁ బ్రధానభూతుఁడయి రాముఁడు రాజిలు, వానిఁ బాసినన్
దమ్ములు జీవితమ్ము సయితమ్మును నిల్పఁగలేరు కౌశికా! 174

ఉ. ఆరఘురాము నవ్యవికచాంబుజలోచను రాక్షసాళితోఁ
బోరట కీవు వెంటఁ గొనిపోయెదవేనిఁ గుమారహీనతన్
ధారుణి నేను బ్రాణములఁ దాల్చుట కల్లయటం చెఱుంగు మో
భూరిదయామరందపరిపూర్ణమనస్సరసీజ! గాధిజా! 175

కం. జ్యేష్ఠుఁడు రమణీయగుణగరిష్ఠుఁడు, ధర్మాత్మతావరిష్ఠుఁడు, పరమ
శ్రేష్ఠుఁడు రాముఁడు మౌనిశ్రేష్ఠ! అతనిఁ గొనిచనంగఁ జెల్లునె? నీకున్.

కం. సవనముఁ జెఱచెడి రక్షో
నివహము మడియుటయె నీవు నెమ్మదిలో న
త్యవసరమని తలఁచినచో
నవధారు మునీంద్ర! మామకాశయ మింకన్. 177

కం. చతురంగబలసమన్విత మతులం బీసైన్య మొక్క యక్షౌహిణి; నేఁ
బతినై దీనికి రక్షస్తతితో యుద్ధంబు సేతుఁ దాపసముఖ్యా!

శా. ఈ నాభృత్యుల్లు విక్రమోన్నతులు, భూరిప్రాసులున్, మంత్రవి
ద్యాజ్ఞానుల్ సుమి, వీరితో సమరమూర్ధంబందు నే నిల్చి మ
త్సేనారక్షణ మాచరించుకొనుచున్ జెండాడెదన్ వైరులన్
మానీశాన! ప్రచండసింహము మహామత్తద్విపాళిం బలెన్. 179

వ. అనిపలికి యించుక యాలోచించి 180

శా. ఆ రాకాసులనంగ నెట్టిరు? తదీయప్రాభవం బెట్టి? దె
వ్వారవ్వారలు? కూటయోధులును దుర్వారోగ్రవీరోన్నతుల్
ఘోరాకారులు, కామరూపులు, మహాక్రూరాత్మకుల్, వారితోఁ
బోరాటం బొనరించుటెట్లు? మునిరాణ్మూర్ధన్య! తెల్పంగదే. 181

మ. అనఘా! తావకయజ్ఞవిఘ్నకరుఁ డాయర్థేశుతమ్ముండు రా
వణుఁడైనన్ లవణాసురుండయిన దుర్వారుండు మారీచుఁడై
నను దత్సోదరుఁడౌ సుబాహుఁడయినన్ వారిన్ రవంతేని నేఁ
జెనకంజాలను, నిక్కమిద్ది, ఇఁక నీచిత్తంబు మౌనీశ్వరా! 182

ఉ. భూరిపరాక్రమక్రమవిభూతులు కాలవిపర్యయంబునన్
మాఱుచునుండుఁ బ్రాణుల, నమందగతిన్ బయి కుబ్బు నొక్కఁడన్
బేరుడుగున్ మఱొక్కతఱి, మే మిపు డాజిని రావణాదులన్
మాఱుకొనంగఁజాలముచునూ! విధినిశ్చయ మిట్టులుండుటన్

తే. గీ. దేవ గంధర్వ పన్నగ దితిజ యక్షు
లైన రావణునకుఁ జాల రాజి ననఁగ
మనుజు లెంతటివార లాతని జయింప?
కాన క్షమియింపుమయ్య నన్ గరుణతోడ. 184

కం. సమర మొనర్చెడితఱి వాఁ
డమరాధిపముఖ్యులగు మహాసురుల తే
జమునైన లాగునఁట; యే
క్రమమున మాబోంట్లు గెలువఁగాఁదగు నతనిన్? 185

చ. రఘుకులుఁ డిట్లు దుర్భరజరాభరజర్జరితాంగసంగతిన్
లఘుతనుబొందుటల్ మదిఁ దలంపఁగఁ గాలము మాఱిపోయె, దై
వఘటనఁజేసి సజ్జనులు బన్నములం బడనైరి, యెల్లచో
నఘ మతివిస్తృతింగనెఁ, గటా! చెడుకాలము దాపరించెఁగా! 186

చ. మృదుమధురంబుగా నిటుల మేదినినాథుఁడు విన్నవించి బె
ట్టిదుఁడగు నమ్మునీశ్వరుని డెందముతీ రెఱుఁగంగలేక నె
మ్మది యురియాడుచుండఁ బవమానవిలోలతరంగతుంగమా
నుదధి మునుంగువానిగతి నుక్కిరిబిక్కిరియయ్యె భూధవా! 187

## విశ్వామిత్రుఁడు దశరథునిపైఁ గోపించుట

తే. గీ. అంత సుస్నేహపర్యాకులాక్షరములఁ
బలుకు దశరథరాజేంద్రు పలుకులు విని
మనమునందున గాటంపుఁగినుక వొడమ
గాధితనయుండు తీవ్రవాక్యముల ననియె. 188

మ. బళిరా! నీదగు కోర్కెఁదీర్తునని సంభావించి తెంతేనియున్
దొలుతన్, గార్యము చేయవచ్చుతఱి కేదో యుక్తిగాఁ దప్పుకో
వల నూహించెదు, చేసినట్టి ప్రతినన్ బాలింప వారౌర! మున్
బలుసింగంబయి యిప్డు లేడితనమున్ వాంఛింతువే భూవరా! 189

తే. గీ. రఘుకులంబున కీవిపర్యాసవృత్తి
తగినయట్టిది గాదుమూ! ధరణినాథ!
అమృతకరుఁడైనయట్టి శీతాంశునందు
వేఁడికిరణంబు లెప్పుడైన వెడలునొక్కొ? 190

శా. కాకుత్స్థాన్వయ! చేసినట్టి ప్రతిన గాపాడుకోలేక యే
దో కార్పణ్యముఁ జూపుచుంటి, విఁక నీతో నాకు వాదేటికి?
నీ కీకష్టము లేల? వచ్చినగతిన్ నే నేగెదన్, బాంధవా
నీకంబుల్ గొలువన్ సుఖంపు మెలమిన్ హీనప్రతిజ్ఞుండవై. 191

తే. గీ. అమ్మహాముని కోపింప నఖిలవసుధ
వడఁకె, దేవౌఘమునకెల్ల భయము గలిగె.
లోకమిత్రుండు మౌని యల్గుట యెఱింగి
సువ్రతోత్తముఁ డవ్వసిష్ఠుండు పలికె. 192

—♦ వసిష్ఠుఁడు దశరథుని సమాధానపఱుచుట ♦—

కం. జనవర! యిక్ష్వాకుకులం
బునఁ బొడమిన యపరధర్మమూర్తివి, నీవే
యని మాట తప్పనేడఁ ద
ప్పనివాఁ డొకఁ డుండునయ్య? పావనచరితా! 193

సీ. పదిదిక్కులందు నప్రతిహతంబుగఁ దేరు
నడుపఁగాఁదగు నేలుబడి వహించి
అమరేంద్రు వైభవం బదియెంత యనిపించు
నతులసంపదల నోలాడఁ జాలి
ముజ్జగంబులకును నొజ్జబంతి యనంగఁ
దగు మేలిగోనములఁ బొగడు గాంచి
ధృతిమంతుఁ డమితసువ్రతవంతుఁ డితఁడని
యఖిలలోకముల విఖ్యాతి నంది
తే. గీ. తనరు నీవంటిచతురుండు ధర్మపథము
విడువఁజెల్లునె? ప్రతిన గావించి విడుట
యఖిలపుణ్యంబుఁ జెఱుపదే? యట్లుగాన
ముని కొసంగుము రామచంద్రుని బిరాన. 194

చం. ఇందు మనోహరంబయిన యివ్వనవాటిక చూచినప్పుడే
డెందము మమ్ము నిల్వ నిట డిగ్గితి, మిప్పుడ పోవలెం జిదా
నందవిభూతి గల్గ, లలనాజనసంగమసౌఖ్య మేల, ర
మ్మిందునిభాస్య ! నీమది యభీష్టము నేకురునట్లు చేసెదన్. 104

కం. అని చేరం బిలిచి కర్ణం
బున నొకమంత్రంబు నుడివి పూఁబోఁడి ! మనం
బున నిది జపింపు, మింక గ
గనగమనము గల్గు, నీదుకాంక్షలు తీరున్. 105

చం. అని కరుణించి సిద్ధుఁడు వియత్పథజాంఘికుఁడైన మెచ్చి య
వ్వనిత విభాకరుం డపరవార్ధిఁ బడన్ మణిమంజరీగృహం
బునకు నిజేశ్వరుం డరుగుపూట యటంచును నిశ్చయించి య
మ్మనువు జపించి విష్ణుపదమార్గమునం జనియెన్ రయంబునన్. 106

కం. చని తత్కాళీగేహంబున నొక మగనాలికూటమునకై కనుగూ
ర్పనియొక్కజారుతోనింపునఁ బొదలుచును త్తరంపుమూల రమించెన్.

తే. గీ. అనుదినము వేళయైనప్పు డవ్వధూటి
అటకుఁ దా వచ్చునట్లుగా నతఁడు వచ్చు
నట్లుగాఁ జేసి యట్టుల నతనిఁ బొందు
విడువఁజాలక మెలఁగెఁ బూవిలుతునాజ్ఞ. 108

చం. మనుజకులేంద్ర ! అంత నభిమానధనుం డొకనాఁటి రేయిఁ గాం
చనరుచివారముల్ గల హజారమునం గొలువున్కిఁ జేసి య
వ్వనితలు నల్వురున్ మునుపు వచ్చుక్రమంబున వచ్చి కాళికా
ఘనగృహసీమఁ జేరి రతిఁ గాంచుచునుండిరి నాల్గుమూలలన్. 109

కం. అంతట నభిమానధనుం
డాంతరమునఁ గాళికాపదార్చనసేవా
నంతరతి వోడమ నుడిగవు
టింతులతోఁ గొలువుదీరి యేతెంచుటయున్ 110

కం. వచ్చిన దివ్వటివెలుఁగున
అచ్చెలువలు నాథుఁ జూచి రాతఁడుఁ గనియెన్

తచ్చపలాక్షుల, కనుఁగొని
ఇచ్చ మహైశ్వర్యసమభివృతముగ నిలువన్. 111

కం. తరుణులు నలువురు నప్పు డొం
డొరుల చరిత్రంబు లెఱిఁగి యొదవినభయమున్
నిరసించి యొక యుపాయము
దొరకొన విభుఁజేరి ధైర్యధుర్యాత్మకలై. 112

వ. కట్టెదుట నిలువంబడి కాళికాపదాంబుజంబులు భజియింప నింపునం జనుదెంచిన యక్షకమలాక్షుల మిన్నలువురము, మదీయనాయకులు నేమును ననుదినంబు నిశాసమయంబున నిచ్చటికి వచ్చిపోవుదుము, మాకు నతీతానాగతవర్తమానంబులు తెలియుట కడుగం బనిలే, దింతయేల, నీయంతరంగంబున భవదీయ భార్యాసౌందర్యవిశేష భాషణాదులు మాయందుఁ దోఁచుటంజేసి సందియంబు కందళించి నది, కావున నింతయుం దెలుపవలసె· అచ్చెలువలు మాయంశం బున జనియించినవారలుకావున మాపోలికలు వారికిం గలిగియుండు, అయ్యండజయానలకు శుభంబుఁగోరికదా యేతన్మహాశాంకరీ పద పంకజారాధనకు ననురాత్రింబు నరుగుదెంతు, మిందుర, మ్మని యిందుధరసుందరీసమీపంబునకుఁ దోడ్కొనిపోయి నిర్మాల్యప్రి సాదంబుగా విభూతియొసంగి నీయంగనల సద్ధర్మంబుగా నేలి మా మనంబులు చల్లఁజేయుమని యనిపిన నజ్జననాథుండును నేమియుం బలుకవెఱచి యూరక వెడలె, అప్పుడు. 113

కం. అచ్చపలాక్షు లతిత్వర
వచ్చి నివాసముల నిలువ వసుధేశ్వరుఁడున్
జెచ్చెరమనము తో వెస
అచ్చటికిన్ వచ్చి వారి నందఱఁ జూచెన్. 114

తే. గీ చూచి మనమున మిక్కిలి చోద్యమంది
వారలొనరించు నతులోపచారసరణి
తేలి తజ్జాలసంసక్తిఁ దెలియలేక
అధికతరమైన ప్రేమతో నాదరించె. 115

జగ:- ఇఁక నీమాటలు చాలించవమ్మ. మనదేశాన నిట్టి వింతరోగాలు లేవు. బ్రతికి పోయినాము. నీటినిగుఱించినవిషయము లింకను గొన్ని కానీ.

కృ:- వాపీజలము కొద్దిగ నుండుటచే నందుఁగలిగెడు కాలుష్యమువలన నది పానమొనరించువారికిఁ దోడనే యసహ్యాకరమగు నంటువ్యాధు లంకురించుచుండును. జలబాహుళ్యముగల తటాకాదులందుఁ గలిగెడు కాలుష్యము మన కంత తెలియునట్లుగఁ గాకున్నను మఱియొకవిధముగనైన నారోగ్యభంగము కావించుచుండును. కాన మన మెల్లరము నీవిషయ మెఱిఁగి జలగ్రహణాదికార్యము లొనరించుచుండవలెను. నీటియొడ్డున నెడముగ నిలువఁబడి యుదకము ముంచుకొని దేహవస్త్రక్షాళనాదికముల నొనరించు టుచితమన నందు స్నాన మొనరించుట బట్టలుతుకుట పుక్కిలించి యుమియుట దోషములని వేఱుగఁ జెప్పనేల? మనము పానముచేయు నుదకమున నురుగుండరాదు. జల ముప్పఁగను గలుషముగను నుష్ణముగను నుండినఁ బానముచేయరాదు. ఉదకము ద్రావునప్పుడు నిలుచుండియు వంగియుఁ బరుండియు శిరోవేష్టనముగలిగియు నుండరాదు. నే నొకసారి దీనినిగూర్చి మానాయనగారి నడిగితిని. ఈనియమము లన్నియు మన యారోగ్యమున కాధారములనియు భిన్నాచరణముచే నుదకము దేహమందు మార్గాంతరవర్తియై హాని కలిగించుననియుఁ జెప్పియున్నారు. నే నిందులకుఁ గారణము లడిగిన నవి మనకు దుర్గ్రాహ్యములనియు సర్వము సకారణముగ నెఱుఁగుట మితాయుఃపరిమితిగల మానవుల కసాధ్యమనియుఁ జెప్పియున్నారు. గరళము నుమ్మెత్త ప్రాణాపాయకరమని వైద్యశాస్త్రము నుడివినమాట మన మెట్లు విశ్వసించవలెనో తక్కిన నియమములు నటులనే విశ్వసించవలెననియుఁ గొన్నివిధులు మాఱినతోడనే ఫల మగుపడుననియు మఱికొన్ని కాలక్రమమున ననుభవసిద్ధము లగుననియు బుద్ధిమంతులు నియమము లాచరించి వాని కారణములఁ దమ శక్తికొలఁది గ్రహింపవగుననియు వివరించియున్నారు. కావునఁ గారణము గ్రహించనేరక విధిమీఱి నడచుట స్వనాశస్వీకరణము వంటిదగును. మన పూర్వఋషులు దోషమనిచెప్పిన ప్రత్యంశము నైతికారోగ్యభంగకరమని తెలియుచుండును. బుద్ధిమంతు లట్టి నియమముల నొనరించుచుఁ గారణముల నరసి చేతనైనవఱకు నెఱిఁగి సుఖించెదరు. మందమతు లట్టి యోపిక లేక నియమముల దాఁటుచు నతిక్రమించి వర్తించుటచేఁ గలుగు ముప్పుల ననుభవించుచు దుఃఖములపాలఁ బడుచుందురు. నీరుపుచ్చుకొనుటయందును మితి యవలంబించు టావశ్యకము. మిక్కిలిగ దాహమైనప్పుడే దేని నమలినవెనుక నీరు ద్రావవలెను. అట్లాచరించనిచోఁ బ్రాణాపాయకరమగును. నీటివలన దాహము తీఱుటయు దేహములు వస్త్రములు నితరపదార్థములు శుభ్రపఱచఁబడుటయునే కాక యుష్ణకాలమున శీతమును శీతకాలమున నుష్ణమును వ్యాపింపఁజేసి మనకు సుఖమునిచ్చును. కావున జలాశయసమీపనివాసము సుఖప్రదము.

జగ:- తీఁగమట్టుకొన్నఁ బొద కదలునట్లు చెప్పినకొలఁదిఁ బెరఁగిపోవుచున్నది. ఇఁక నిదిచాలును గాని భోజనమును గుఱించికూడ 4 మాటలు చెవినివేయుము. అక్కడికి సరిపోవును.

— ఆహారము —

కృష్ణా:- గాలినిగుఱించియు నీటినిగుఱించియు మనము కొంచెముగఁ దెలిసికొనియుంటిమి. అటులనే ప్రాణధారణమున కావశ్యకమగు నాహారమునుగుఱించియు నెఱుఁగుట ముఖ్యము. మనము భుజించు నాహార మంతయుఁ గడుపులో నెడమవైపున నాగసారకాయరూపంబున నిమిడియుండు నన్నకోశమను తిత్తిం జేరియం దాకుపసరువన్నెచే నొప్పు జఠరాగ్నిబలముచే ద్రవరూపముం బడసి నిశ్వాసములవెంట లోని కరుగు ప్రాణవాయుస్పర్శచే రక్తమై దేహ మంతటను వ్యాపించి పుష్టిని గలుగఁజేయుచుండును. అచట మిగిలిన పిప్పి తత్కోశమునకు దిగువనుండు పేగులోనికి దిగును. ఈపేగు స్ప్రింగుదీపములోని తీఁగమట్టవలెఁ జొత్తికడుపున కెడమవైపున నుండును. మనవార లది ముప్పది మూడుమూరలని చెప్పుదురు. అన్నకోశమున రక్తరూపము నందఁజాలక యాపేగులోనికి దిగిన బరువుపదార్థము కొంత రక్తరూపము నొంది శరీరమున వ్యాపించును. మిగిలిన దెల్ల నీపేగునకు దిగువభాగమందలి పురీషనాళమువఱకు దిగి మలమై విసర్జింపఁ బడుచుండును. ఆఁకలి బలిసినప్పుడు దేహము శుష్కించి భోజనముచేయఁగనే లావగుచుండును. భోజనమునకుఁ బూర్వము వదులుగ నుండు నుంగరము తదనంతరము బిగుతుగ నుండు టెల్లరు నెఱిఁగినయంశమే. ఒకసారి శరీర మంతట వ్యాపించిన రక్తము కాలవ్యవధిచే మాఱి చెమటమొదలగు వానిరూపమున వెడలుచుండుం గావున నటుల వ్యయపడిన రక్తమును బూరించుటకొఱకు మరలమరల భోజనముచేయు నావశ్యకత కలుగుచున్నది. భూగోళమున ముప్పాతికభాగము జలమును బాతికభాగము స్థలము నుండునట్లు జంతుజాలముల శరీరములందు నందును ముఖ్యులైన మానవులందు ముప్పాతికభాగము ద్రవపదార్థమును శేషించిన పాతికపాలు గట్టిపదార్థమును గలదు. కావున మన యాహారము నందు కనువుగ నుండవలెను. మఱియు మన శరీరమునందు రక్తముఁ గండలు నెముకలు రక్తనాళములుఁ గొవ్వుఁ గలసియున్నవి. మనము భుజించు పదార్థములు జీర్ణములై వీని కన్నిటికిని సత్తువ నిచ్చుచుండవలెను. కావున నేపదార్థభోజనము దేనిని బలపఱచునో మనము తెలిసికొను టవసరము. భోజ్యపదార్థము లభిరుచి నిచ్చుటకుఁ బాక మొనరించువారలు రసవర్గమునం దగు పాళ్లుమాత్రము పదార్థంబుల మిళిత మొనరించునట్లు మనమును శరీరపోషణార్థము వలయు పదార్థముల పాళ్ళ నెఱిఁగి సమకూర్చి భుజించుచుండుటయు ముఖ్యము. మన మాహారించు పదార్థములే మనకు బలాధిక్యమును బలక్షీణతనుఁ

గలిగించుచుండును. కావున మనము భుజించు పదార్థములలో నెయ్యది తగినది యెయ్యది తగనిది దేనిగుణ మెట్టిదియయినది దేని నెంతెంతగ భుజించవలసినది తెలిసికొనియుండవలెను. మనము తినుపదార్థములు దేహమునందుఁ గల వివిధతత్త్వములఁ బూరించుటేకాక యవసరమగు నుష్ణముకూడఁ గలిగించునవిగ నుండవలెను. కాయధాన్యములును దుంపలును శరీరమునఁ గండ నిచ్చును. కంకిధాన్యములును గాయగూరలును రక్తవృద్ధి నిచ్చును. అన్నిజాతులపండ్లు రక్తశుద్ధి నొనరించి వృద్ధిపఱచును. గోధుమలం దెపుడును గొంచెము నెయ్యిగాని వెన్నగాని చేర్చినచో దళము తక్కువగును. మలబంధ మేర్పడును. దంచి భుజించిన గుణము గొంత. పాలు రక్తముఁ గండ నిచ్చును. నెయ్యి వెన్న పాలు మొదలగు చమురు పదార్థములు జఠరాగ్నికిఁ దోడ్పడి యుష్ణముం బెంచును. అయినను నీచమురు పదార్థములు మితముగ భుజించుచుండవలెను. మాసములకొలఁదిఁ బచ్చికూరలం దినినచోఁ గొన్నివ్యాధు లంకురించును. పక్వముకానిఫలము లజీర్ణవ్యాధి కలిగించును. మిగులం బండి మెత్తపడినవియు ననారోగ్యకరములు. కావున నీవిషయముల మనంబుల నిడికొని మన మన్నివస్తువులను దగుమాత్రము భుజించుచుండవలెను. హితభుక్ మితభుక్కని మనవారు వాడుచుందురు. ధాన్యముల పొట్టునందు జీర్ణింపఁజేయు శక్తి విరేచనము కావించు గుణముఁ గలదుకాన నలుఁగ దంచిన బియ్యమును బప్పులను దినుట మంచిది కాదు. కొంచెము పొట్టుతో భుజించు టావశ్యకము.

కం. హితమైనది మితముగఁ దిన
అతిదృఢసంహననులగుచు నారోగ్యముచే
మతిమంతు లగుదు. రటుగా
కతిగాఁ దిన, వారి కెపుడు నలవడు జడిమల్.

మితభుక్కుల రోగము లాశింపఁజాలక తొలఁగిపోవుచుండును. మండెడు నిప్పుపైఁ దగుమాత్ర మాజ్యము వేసిన మఱింత మండును. ప్రజ్వరిల్లుచుండు నిప్పుకంటె నధికముగ నందుఁ బోసిన నాయాజ్యమే దాని నార్పివేయును. జఠరాగ్ని వేపకాయంత యుండుఁ గాన దానిం బ్రజ్వలింపఁజేయుటకుఁ దగినంతగనే చమురుపదార్థముల నాహరించవలెను. అతిభోజన మజీర్ణవ్యాధి నంకురింపఁజేయును. ఈ యజీర్ణరోగమే సర్వవ్యాధులకును మూలకారణము. కావునఁ బదార్థములఁ బరిమితి పాకము మన మెఱిఁగి భుజించుచుండవలెను. శిశుపోషణమునకీవిషయము తెలిసియుండుట పరమావశ్యకము. ఉప్పు నినుము జలము రక్తమును శుద్ధిపఱచి శరీరమునందలి యెముకలకును గోళ్లకును దంతములకును బలము నిచ్చును. రక్తక్షీణత కలిగి రోగ మంకురించినపుడు కాని మనము వేఱుగ లోహమును భుజింపము. పరమేశ్వరుఁ డీయినుమును దోసకాయ యుర్లగడ్డ మొదలగు శాకములందును దగుమాత్రము చేర్చియుండుట పరమాశ్చర్యకరము. సగ్గుబియ్యము సులభముగ జీర్ణమగును. కొమ్మలులేని బొప్పాయిచెట్టు

వంటిదాని తోఁట తీసి కడిగి యెండించి దంచి పొడి జల్లెడంబట్టి వేయించి రంగువేసి సగ్గుబియ్యము మను పేర నంగడి కంపుదురు. దీనిని రంగుపోవునట్లు శుభ్రముగఁ గడిగి వడుప్రలు పెట్టి వాడుకొనవలెను. అరమాటు పిండి సులభముగ జీర్ణమై శరీరమునకు బలము నిచ్చును. అరమాటు వేరు దంచి నీళ్ళయందుఁ గలిపి తేరఁబెట్టి నీరువంచి యెండఁబెట్టుదురు. బటానీలుఁ జిక్కుడుగింజలు ననుములుఁ గండపుష్టి నొసంగుం గాని కాయకష్ట మొనరింపనివారి కీ బలువు పదార్థములు జీర్ణించుట దుస్తరము. కనుక భోజనమున కరిగినపు డప్రయత్నలబ్ధమైనవానితోనే సంతుష్టికలిగియుండవలెను. విచారముగ నుండినఁ దినిన పదార్థములు చక్కఁగ నొంటఁబట్టవు. ఆఁకలియున్నపు డారగించుటయు రుచ్యపదార్థము లమరినపుడు మితియందు లక్ష్యముంచుటయు నారోగ్యసంరక్షణ మొనరించును. భోజనకాలమున నితరచింతల విడిచి యీశ్వరధ్యాన మొనరించుట కడు నారోగ్యప్రదము. కావుననే మనవారు భోజనమునకుఁ బూర్వము దేవతార్చనమును భోజనకాలమున గోవిందస్మరణలును గావించు నలవాటు కలిగియున్నారు. చకితమనస్సు మలికితములు నడంచి యానందసముద్రమున నోలలాడించునది యీశ్వరధ్యాన మొండు దక్క నితర మెద్దియు లేదు. అతిశీఘ్రముగ నతిసుకుమారముగ భుజించుటయు నపాయకరము. అన్నిపదార్థములును నమలితినవలెనని కొంద అందురు. మనదేశమున భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయములని భోజన మైదువిధములుగ సిద్ధపఱుపఁబడును. భక్ష్యములు రొట్టెలు మొదలగు గట్టివస్తువులు; నమలితిన నవసరము. అన్నము మొదలగు పదార్థములకు దంతము నాలుక యంగిలి డ తాఁకునట్లు కొంచెము తాటించి తినవలెను. లేహ్యములు తేనె మొదలగునవి; నాకి తినవలసియుండును. చోష్యములు చారు పులుసు పాయసము మొదలగునవి; పీల్చి మ్రింగవలసినపదార్థములు' పానీయములు నీరు పానకము పాలు మొదలగునవి; త్రాగవలసినవియై యున్నవి. కావున నెల్లపదార్థముల నమలితినుట సమంజసము కాదు. కావుననే మనవార లనిష్టముగ మాట లనువారి నీళ్ళునమలుచుఁ జెప్పెనందురు. అనిష్టముగ భుజించువారు నమలితినుచుందురని దీనిచే మన మెఱుఁగఁదగును. భోజ్యపదార్థములు కాంచినను వాని వాసన గ్రహించినను మన కాఁకలి యగుచో నోరూరును. మనము భుజించు పదార్థ మాయుమ్మి నీటిం గలసినఁగాని జీర్ణము కాదు. రోగపీడితుల కీయుమ్మినీ రూరనందున వా రాహరించుపదార్థము నాలుకం జుట్టుకొనుచుండుటచేఁ దినఁజాలకుందురు. ఉమ్మినీటిం గలియకుండఁ దినిన పదార్థము జీర్ణము కాదు. ఉమ్మినీరు జఠరాగ్నికిఁ దోడ్పడును. కావున నాలుక చుట్టుకొనుచుండినపుడు మిగుల జాగ్రత్తకలిగి భుజించవలెను. వేఁడి వేఁడి పదార్థములు భుజించునపు డుమ్మినీ రూరదు. దాన నజీర్ణరోగ ముద్భవించును. గర్భకోశమున నాభివద్దఁ బుం డగును.

## —♦ జ్యేష్ఠభగినులు (అక్కలు) ♦—

నాకు జ్యేష్ఠభగినులు ముగ్గురు. అందుఁ బెద్దయక్క పేరు విశాలాక్షమ్మ. పల్నాడు తాలూకాలోనిదే యగు పల్లిగుంతలో మా మేనత్తకొడుకునకే యిచ్చి మా తండ్రి యామె పరిణయము జరిపెను. కాశికిఁ బోయివచ్చినతరువాతఁ గలుగుటంజేసి కాఁబోలుఁ గాశీ విశాలాక్షిని గావించెను. ఆయన సంతానమున కంతకును నాయమయే యాద్యురాలు. బహుకాల మామె పతితోఁ గాఁపురముచేసి పలువురుబిడ్డలం బ్రసవించెనఁట. కాని యొక్కతెమాత్రమే యుద్వాహితయై యొక్కింత సంతోషపెట్టెను. ఆకె పేరు కృష్ణవేణి. భర్త తెనాలితాలూకా వలివేరు గ్రామవాసియైన రూపాకుల నరసింహము. కృష్ణవేణియు రజస్వలయై గర్భాధానముగాకపూర్వమే గతించినది. నరసింహము మరలఁ బరిణయము జరుపుకొని సంతతి కొంత కనియెనఁట. అతఁడును గతించెను. తత్సంతతి మాత్రము తత్ప్రాంతమునఁ దనరెడిని. ఆత్మజమరణము నవలోకింపకుండనే యస్మజ్జ్యేష్ఠభగినియగు విశాలాక్షమ్మ యంతరించినది. తత్పతియును దరువాతఁ దనువు విడిచెను. ఆదంపతుల కనుజుని తనయుఁడు దత్తుఁడు.

ఆమె యనంతరపుటక్క జోగమ్మ. అస్మజ్జనకుఁ డనేకతీర్థక్షేత్రయాత్రలాచరించినవాఁడగుట వలంపురి కరిగివచ్చిన యనంతరము జనించిన తనయను జోగులాంబనుగాఁ జూచుకొనియెను. ఆయమనుగూడ ననుజ యాత్మజునకే యర్పించెను. ఆయన మాకు మేనత్తకొడుకే కాక మేనమామకొడుకుగూడ నైయున్నవాఁడు. ఈ యక్కయు నెంతయో కాలము కాంతుతోఁ గాఁపురముచేసినది. ఎందఱుబిడ్డలనో కన్నది. బలవతికూడ నై పనిపాటలు బాగుగాఁ బచరించెడిది. పతిభక్తి కలదియై కొట్టినను దిట్టినను బదులుపలుకకున్నయది. అట్టి భక్తిప్రపత్తులుగల పతివ్రత కత్తపోరు నాడబిడ్డలపోరు నధికముగా నుండెడిది. భర్తవలని ప్రహారణములుగూడ బహుళముగానే యుండెడివి. అత్త యామెను గోడలనుగాఁ జూచినది కాని మేనకోడలనుగాఁ జూడలేదు. ముండమోసి దండనున్న మువ్వురుబిడ్డలతోఁపాటు తానును దత్స్నుషపైఁ దప్పులు పెట్టుచుఁ దనయుని ద్వారమున దండించినది కాని దయఁజూపలేదు. పెక్కేల? తద్గృహమున కామె దాసియయ్యెఁ గాని కోడలు కాలేదు. అర ఫర్లాంగుదూరమునుండి యహరహమును 60 బిందెల నీళ్ళు నామె యొక్కర్తయే యాత్మగృహమునకు మోసినది కాని యత్త యాఁడుబిడ్డలు నాఖరు కొక్కగుక్కెఁడైనను గొనితెచ్చినవారు కారు. కట్టివిడిచిన గంపెఁడు గుడ్డలఁ జాకితవోలె నాకె యుతికినది కాని యన్య లంటుకొనఁగూడ నంటుకొనరు. అట్లు పొలపుఁబనులమాత్రమే పొనరించుచుఁ గఱ్ఱపెత్తనముఁజేయు కాంతుననుజులక్రిందను నత్తక్రిందను నణఁగిమణఁగి కష్టపడఁగాఁ బడఁగాఁ గడకుఁ గడుపు పండెను. తనయాపంచకమును గనియెను. కాని యొక్కర్తయుద్వాహముతప్పఁ దక్కినపెండ్లిండ్లు తాఁజూడకుండనే తనువువిడిచెను. ఆభాగ్య మబ్బకే యబ్బినది కాని యమ్మ కబ్బదు.

ఆమె 5 గురు బిడ్డలలోను నగ్రిమ భ్రమరాంబ. అదియు నేను సంవత్సరన్యూనాధిక్యముగా సవయస్కులము. అందువలననే యన్యోన్యము కలసిమెలసి యాడుకొనుచుండెడివారము. అయ్యాటలలో నద్దాని దంశనముచే నస్మదూరువున నేర్పడిన యంక మిప్పటికి నీక్ష్యమాణము. తనువువిడుచునంతకు, దానికిని నేను గళకమువిూఁదఁ బడఁ

ద్రోయుటచే గండస్థలమునఁ గలిగిన పొట్ట కానఁబడుచుండెడిది. ఆ భ్రమరాంబను బదులిచ్చిరయే యయ్య కోటయ్య జఘన్యజుఁడైన సదాశివయ్యను సకళము నలుపఁగలిగెను. ఈయఁబడినది యినుపకుతికె హనుమయ్యకు. 40 సం॥ లు నామెనకోడలు కాంతుతోఁ గాఁపురముచేసి యష్టకష్టము లనుభవించినను నాఖరు కైదుగురుబిడ్డల నవనిపై నిలిపినది. పతివ్రతయన్న పేరు పడసినది. హనుమయ్య యది కాఁపురమునకు వచ్చినయనంతరమా బల్లకురువను బహుకాల ముండనే లేదు. మాతాపితరుల మనుపనే లేదు. సహోదరుల సంరక్షణమున జననీజనకులకు సాయపడక సతీసహితముగా స్వగ్రామమును విడిచెను. నకరికంటికిని జానపాటికిని నడుమనున్న గుండ్లపల్లిని గృహముకట్టెను. పది వత్సరములుండెను. పైబట్టలతోఁ బఱతెంచి పడరానిపాట్లు పడుచుండుట పరికించి భాగినేయీభర్తకుఁ జెంబుతప్పెలలు మొదలైన చిన్నచిన్న పరికరము లిచ్చి చేతనైనంత సాహాయ్య మేము చేసితిమి. అట్లు గుండ్లపల్లి నిల్లుకట్టుకొని కొడుకు శంకరయ్యను వెంటఁబెట్టుకొని యమరకోశము నాంధ్రనామసంగ్రహము నవ్వానికి సంతఁజెప్పచు ముష్టియెత్త మొదలుపెట్టెను. ముష్టిజీవనముతోనే మువ్వురుబిడ్డలఁ గనిరెను. తవిదయన్నముతోనే తత్సంతతి పెరిఁగినది. ఆరాగిసంకటి యొకపుడు దస్మదనుభూతముగూడ నైనయది. యామధ్యయమున కరిగి యపుడు తండులములకై తడవుకొను తద్దరిద్రకుటుంబము తంటాలు కంటఁ జూడలేక కానిమ్మని కష్టముతో నావిందే యారగించితిని. అట్టిదారిద్ర్య మాయూర ననుభవించి చివరకుఁ జింతపల్లికిఁ జేరెను. పిరాట్ల సుబ్బయ్య పిల్లలచేఁ బ్రారంభవిద్య పఠింపించెను. ఆఱుమాసములో హాయనమోయయ్యారను నధివసించెను. పదపడి భద్రాద్రికిఁ బయనమయ్యెను. అచట గోదావరిం గ్రుంకుచును శ్రీరాముని సేవించుచును నెట్లో స్వకుటుంబమును సంరక్షించుకొనుచు వత్సరద్వయము వసించి మరల నరసారావుపేటకుఁ బఱతెంచెను. అక్కడఁ గూడఁ నొక్క సం॥ముండి మెల్లమెల్లగాఁ గొల్లూరునకుఁ జేరెను. అబ్దచతుష్టయమచటను వెళ్ళించి కొనకుఁ దెనాలికిఁ జనుదెంచెను. అచ్చోటను 6 హాయనములు గడపెను. ఆత్మజు లప్పటి కక్కఱకు వచ్చిరి. ఆత్మజ లత్తవారియిండ్ల కరిగిరి. బాపట్ల బోర్డుహైస్కూలులోఁ బ్రథమకుమారుఁడు పండితుఁడుగాఁ బ్రవేశించుటయుఁ దలిదండ్రులను దద్గ్రామమునకుఁ దఱలిరి. తనుజాపోషణములో మనిరి. మద్భాగినేయి మగని నొక దేవునిగా భావించినది కాని మనుజునిగా భావింపదు. దేవుఁడు త్రిప్పినచోటికెల్లఁ దిరిగినది. చెప్పిన చేఁతనెల్లఁ జేసినది. పతిపలుకునకు బదులు పలికినది కాదు. తనయులను గూడ ధవుఁడు తన యిష్టమైనవారి కిచ్చెను గాని దాని యిష్టమును దలఁపఁడు. అట్లు పడరానిపాట్లు పడి పాతివ్రత్యమును బాలించుకొన్న భ్రమరాంబ తనయ పరిపాల్యమానయగుచును ధవుని తగవులకు వగవక తప్పినది కాదు. తగినకారణము లేకుండనే తగవుకు సిద్ధమగుట హనుమయ్య కాజన్మసిద్ధము. పడఁతియెడలనే కాదు. కొడుకులయెడలఁగూడ నతని నడవడి యటువంటిదే. సతీసుతులు సహించినను గోడండ్రు కాపురము నూడుగలిగించుటయు నేఁడా హనుమయ్య యెడలో యేగి యెట్లో బ్రతుకవలసినవాఁ డయ్యెను. పోషించుబుద్ధిగలిగియు సుతులతని వెతలు చూచియుఁ జూడనట్లుండవలసినవా రయిరి. అగ్రకుమారున కవమానకరముగా నాబాపట్లలోనే భైక్షాన్నభక్షణముతో బహుకాలము ప్రవర్తించి చివరకుఁ చిన్నకొడుకుకడకుఁబోయి యున్నవాఁడట కన్నతండ్రి హనుమయ్య. తల్లి భ్రమరాంబ

యీయిడుములన్నియు వీక్షింపకుండనే ప్రథమకుమారుఁడు బాపట్లఁ బ్రవేశించిన పంచషడ్వత్సరములకే పరమపదించినది.

స్వర్గతయగు భీమరాంబ యగ్రసుతుఁడగు శంకరయ్య యయ్య హనుమయ్య యంతికముననే యాంధ్రనామసంగ్రహ మాదిని పఠించెను. తెలుఁగులలో నింత తెలివి గలిగెను అనంతర మమరకోశము 3 కాండలుఁ గ్రమముగాఁ జదివెను. భద్రాద్రిలోఁ బ్రారంభించెను గాని కావ్యములు, పిత యింతలోనే పెండ్లిచేసెను. పెండ్లము పిన్నెలి గ్రామవాసి నందా చిననరసింహము బిడ్డ వెంకటసుబ్బమ్మ. దాని వీనికిఁ బెండ్లిచేసి తనయ జోగమ్మను హనుమయ్య యానరసింహము నాత్మజుఁడైన కోటయ్యకు బదులిచ్చెను. విద్యానాశాయు వైవాహమును విద్వదుక్తికి విరుద్ధముగా శంకరయ్య నాయన నరసారావుపేట యీరవు చేసినపుడు రామనుగు రామకృష్ణశాస్త్రులుగారిదగ్గఱ రఘువంశ కుమారసంభవములు చదివి మన్వ నేలటూరి మాయూరఁ బప్పు సీతాకాంతశాస్త్రులుగారి వద్ద మేఘసందేశము భారవికావ్యముఁ బఠించెను. మరల నరసరావుపేటకే యరిగి మాఘకావ్యము నైషధము రామాయణచంపువు రామకృష్ణశాస్త్రులుగారి దగ్గఱనే చదివెను. కొల్లూరులోనున్నపుడు కొలిచిన నరసింహశాస్త్రిగారియొద్ద భారతచంపు పఠించి న్యాయశాస్త్రపఠనమునకుఁ బ్రారంభించెను. సంగ్రహన్యాయబోధినులు చదివెను. హనుమయ్య తెనాలికిఁ జనిన యనంతరము దెందుకూరు పానకాలశాస్త్రులు గారిదగ్గఱఁ దిరిగి సంగ్రహన్యాయబోధినులనే చక్కఁగాఁ జదివెను. అంతవఱకు నయ్య హనుమయ్య యండఁ బాయకుండనే యధీతవిద్యుఁడయ్యెను గాని పదంపడి పశ్చిమగోదావరీమండలస్థ కాకరపర్తిగ్రామమునకు గమనించెను. మఱికొన్ని నాటకములు చంపువులుఁ దిరుగవేసెను. దీపికాది దినకరిపర్యంత తర్కప్రకరణములును బంచలక్షణి ప్రభృతులును బఠించెను. తాత్కాలికజనకనివాసస్థానమైన తెనాలికి మరలఁ జనుదెంచెను. పాఠశాలం బ్రవిష్టుఁడై సంస్కృతమున వేదాంతశిరోమణి ప్యాసయ్యెను. హూణభాషం గూడ స్కూలుఫైనలులోను త్తీర్ణుఁడయ్యెను. పదపడి బాపట్ల బోర్డుహైస్కూలులోఁ బండితుఁడుగాఁ బోయి ప్రవేశించెను. ప్రవేశము 20 రూపాయలకే కాని ప్రకృతము (1940) 65 వఱకుఁ బ్రమోషనైనది బాల్యమున ననుభవించిన బహుళ దారిద్ర్యము పటాపంచలైనది. కాని కడు భోగి కాఁడు. 4 ఎకరములు కృష్ణకాలువక్రింద మాగానిభూమిమాత్రము కొన్నవాఁడఁట దైతా సీతారామయ్యగారిచే దత్తమైన స్థలములో నేకాలముననో యేర్పఱచుకొన్న రేకులపాకలోనే పాకమును బడయుచున్నాఁడు. అవ్వాని యభోగమున కా పాకముగూడ బాసటైనది. తెనాలిలో నుండఁగానే ద్వివత్సరములు కాఁపురముచేసి వీని ద్వితీయ దివంగతయైనను వెంటనే మఱియొక చెల్లెలిని బదులిచ్చి మరల సద్వితీయుఁడు కాఁగలిగెను. ఆ ద్వితీయద్వితీయ పొన్నూరు గ్రామమందున్న దుగ్గిరాల హనుమయ్య ద్వితీయసుత యన్నపూర్ణ. ఆభార్యకే 5 గురు పిల్లలు. పూర్వజుఁడే పుత్రుఁడు. పేరు వీరరాఘవస్వామి 17 ఏండ్లు ప్రాప్తించినవి. స్కూలుఫైనలు ప్యాసయినాఁడు. పంచకావ్యములు పఠించినాఁడు. పరిణయము గూడ జరిగినది. కుందేటి లక్ష్మ్యవధానులుగారి కూఁతురే యాతని యర్ధాంగి. అద్దాని పేరును నన్నపూర్ణయే. వీని తరువాతివాఁడు వెంకటేశ్వరస్వామి. వీనికి 14 ఏండ్లు. సెకండుఫారమో యిఁకను థైదో యింగ్లీషే చదువుచున్నాఁడు. సక్రుత్తుగా సంస్కృ

తము సాగుచున్నది. తృతీయ భ్రమరాంబ. అదియును నబ్దదశకవయస్కురాలైనయువి. 4 వది సీతారామమ్మ. అది నష్టవర్ష. 5 వది సత్యవతి. అబ్దచతుష్టయప్రాయ. సంతతి యింత సాగుటచేతనే శంకరశాస్త్రి సంపాదన త్యాగభోగములకుఁ దావీయకపోవచ్చును. ఇది వీని కుటుంబస్థితి. ఇఁక విద్వత్తావిషయము. విద్వత్త విద్వచ్ఛ్లాఘ్యము. సాహిత్యము చాలినంత. వ్యాకరణజ్ఞానము వలసినంత. తల్లిఖితమైన ధాతుముక్తావళి దానికిఁ దగినసాక్ష్యము. శంకరశాస్త్రి శాస్త్రజ్ఞుఁడే కాక సంస్కృతాంధ్రములలో సత్కవిగూడ. వీరవరచరితము నీచసంబోధనము శ్రీరామశతకము మొదలైనవి వీని కృతులు. ముద్రితములైన 3 గ్రంథములను జూడఁగలిగితిని. చిన్నగా ముద్రింపఁబడనున్న శ్రీరామశతకాదులతీరు తేటపడఁగలదు. ధాతుముక్తావళి త్రయోదశాబ్ధిక వత్సరములనాఁడే యచ్చుగూర్పించి యష్టకలల శమ్మఁబడుచున్నది. తద్గ్రంథాదింగల

శ్లో. మాతరం భ్రమరాంబాంచ పితరం హనుమయాభిధం
గురూన్ సర్వాన్ కృతజ్ఞస్సన్ నమా మ్యాశీరవాప్తయే.
ఇనుపకులతికాన్వవాయ శ్శంకరశాస్త్రి శిరోమణి ర్ద్విప్రః
రచయామి ధాతుముక్తావళీ, మేషా సమ్ముదేఽస్తు సతాం.
శిష్యోహం నోరుత్యుపపద సుబ్రహ్మణ్యాఖ్యశాస్త్రిణా మస్మి
యే వ్యాకరణాచార్యా ఇతి విదితా భారతే ఖండే
సుప్రసిద్ధా ధాతవో యే తిజంతత్వేన సూక్తిషు
కవీనాం తాన్ లిఖామ్యత్ర క్లిష్టరూపార్థపూర్వకం.

అనువానిచే శంకరశాస్త్రి జననీజనకులను గురువులను గృతజ్ఞతను వంశమును వర్ణమును దెలిపి గౌరవ మాపాదించియున్నవాఁడు. తన్మాతాపిత్రాదులు ధన్యులైన వారు. వ్యాకరణాచార్యులైన నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారే శంకరశాస్త్రి చరమ గురువులు. సుప్రసిద్ధధాతువు లిందుఁ గ్లిష్టరూపార్థపూర్వకముగా స్పష్టపఱుపఁబడినవి. చిరకాల మీగ్రంథము జీవించియుండుట కట్టి ప్రసిద్ధధాతువులలోఁ బ్రాణధారణ పరమైన జీవధాతువే శ్లావలెనని ప్రారంభమునఁ బ్రకటింపఁబడినది.

శ్లో ఆచంద్రతారకం జీయా దీశ్వరానుగ్రహో దియం
ధాతుముక్తావళి ర్నామ్నా కృతి శ్శంకరశాస్త్రిణః.

అని యట్టియభిప్రాయ మంతమున వ్యక్తము చేయఁబడినది. కేవల సాహిత్య విదుల కీకృతి పగమువ్యాకరణము చక్కఁగా బోధింపఁగలదు. వీరవరచరితము రాజ భక్తిని బ్రజావాత్సల్యమును బ్రబోధించు నొక చిన్నపద్యకావ్యము. నీచసంబోధనము నీచుని సంబోధించి చెప్పిన నీతిగీతములు. మచ్చున కొకటి యిచ్చుటఁ బ్రదర్శ్యమానము.

తే. గీ. ధర్మములను నీదుతరముగా దొనరింప.
భంగములను జేయఁ బాటుపడకు.
గుడిని బిత్తరున్న గుగ్గిల మిడినంత
ఫల మటంద్రు తెలియవలదె నీచ !